సీ. జలధి కట్ట వినాయకుల సూర్యచంద్రుల వరలక్ష్మి నలమార్గశిరములక్ష్మి
గఁగౌరి నుత్తరాగౌరి సాంవత్సరగౌరిని బదియారుగౌరిఁ బసుపు
పట్టమహాగౌరి నిట్టుప్పగౌరిఁ దంగేటిగౌరిని జల్లకూటిగౌరి
సావిత్రిగౌరిని జల్లిగౌరిఁ గరళ్లగౌరి నయ్యాదిత్యగౌరిఁ గూర్చి
తే. నోఁచె నివి మున్నుగాఁగ మున్నూటిమీఁద
నఱువదివ్రతంబు లాత్మజాతాభిలాష
నంజనాదేవి యెవ్వ రేమాచరింప
మనిరో యని యెల్లఁ దోఁచినట్ల నాచరించె. 61

క. ఆకైనఁ బెల్లఁ బత్త్రిరి, యేకద రా యైనదెల్ల నీశ్వరుఁ డనుచున్
జేకొని భక్తి భజింపుదు, రాకపిసంపతులనియమ మరుదు నుతింపన్. 62

సీ. తార్క్ష్యాణ యనుచుఁ బెద్దలచేత శకునముల్ గొనకొని చూపించి కొన్నినాళ్లు
ప్రతివాకముల నుపశ్రుతి ప్రాజ యుండి దానిఁ గోరి యాకర్ణించి కొన్నినాళ్లు
తెలియఁ బ్రాణాచారములఁ బ్రాప్తమని దైవసన్నిధి శయనించి కొన్నినాళ్లు
ఋషులదీవన లెంచి యెదురు చూచి దినంబు లెన్ని యూఱటఁ జెంది కొన్నినాళ్లు
తే. కడఁగి యూరక చనుచున్న కాలగతికి, ఖిన్నమతితోడ దిన్ననై యున్నవేళ
ధర్మదేవత యామెపైఁ గూర్మి గలిగి, యాత్మజోదయ మెఱుకసేయంగఁ దలఁచి.

## అంజనకు ధర్మదేవత యెఱుకతయై వచ్చి యెఱుకచెప్పుట.

సీ. విరజాజిసరులఁ బన్నినకొప్పు నుదుటఁ గొప్పు వలపుగుల్కెడుచందువంకబొట్టు
దంతంపుఁగమ్మలఁ దళుకూనుచెక్కిళ్లు చనుపమ్మి మొగ్గల జాఱుపైటఁ
కళుకుఁగడాని బంగరుసందిదండలు చెలిచాయసంకుఁబూసలసరములు
మేనఁ జందా కెంపుమించుబొడ్డాణంబు మొలనూలి చిఱుగంటఁ గులుకురవళి
తే. జిలుఁగుఁజందురకావిదువ్వలువ నెఱిక, మించుమించినయొడలు రాయంచనడలు
పచ్చరాబుట్టి మూఁపున హెచ్చుపట్టి, మీఱ ధర్మవుకోరవంజితీరు దాల్చి. 64

చ. ఎఱుకలసానిలీలఁ దనయింటికి నీగతి వచ్చి మానవే
తెఱవ! విచార మేల? మదిఁ దెల్పెదు మవ్వ! నిజంబు నమ్మవే
తఱకట గాదు నాయెఱుక తక్కక నిక్కము కోరి వేడవే
యెఱుక కటన్నమాట విని యెంతయు నింతియు సంతసంబునన్. 65

ఉ. చెక్కిటఁ జెయ్యి చేర్చి మనుచింతిలుచున్నది పువ్వుఁబాన్పుపై
గ్రక్కున లేచి పాదకటకధ్వనితో మొలనూలినాదుతోఁ

జిక్కినకౌనుతో బటువుసిబ్బెపుగుబ్బలజాఱుపైఁటతోఁ
జక్కెరబొమ్మ తత్తఱ మెసంగ వెసం దనుఁ జేర వచ్చినన్. 66

క. అమ్మరో! రావె బంగరు, క్రొమ్మెఱుఁగుటెను ముత్తియములు గొనితేవె నీ
నెమ్మదికోరిక దెలిపెదఁ, గ్రమ్మినకొల్లాపురమ్మకరుణను దుండీ. 67

ఉ. బంగరుగుంటివింటిదొరపాటి యనం దగుమేటిసాటిమీ
రం గలగొంటురక్కసులరాయిడిగెంటెడుపోటుబంటు నీ
యంగదవాపఁ బాపఁ డుదయంబగునా? తెలిగన్నులాన మా
సింగనిపాదమాన నుడి చెప్పినఁ దప్పటులే దొకప్పుడున్. 68

క. అవ్వా! పతియనుమతి మతి, నివ్వటిలం దపము సేయు నీవెతలెల్లం
దవ్వగు నవ్విత మున నని, యవ్వనజాస్యయు నదృశ్యయై పోవుటయున్. 69

క. ఆశ్చర్యహర్షరసములు, నిశ్చలభావంబు దెలుపు నెలఁతుకపలుకుల్
నిశ్చయముగఁ దనపతికి వి,పశ్చిచ్చూడామణికిం ద్రపావతి చెప్పెన్. 70

క. బహుకాలమునకు వంశో,ద్వహుఁ డైనసుతుండు లేమిఁ దద్దయుఁ జింతా
వహమానసుఁ డగుకేసరి, గృహిణిపలుకు లాదరించి యిటు లని పలికెన్. 71

క. ఎఱుకలసాని వచించిన, తెఱవునఁ గనఁ గలుగుసుతుఁడు దేవస్తుత్యుఁ డీ
వెరవున కనుకూలం బగు, తెఱఁ గొక్కటికలదు వినుము తెలిపెద నబలా! 72

తే. పదమటిపయోధిచెంతఁ బ్రభాస మనెడు, తీర్థ మొక్కటి వెలయుఁ దత్తీరభూమి
మును భరద్వాజుఁడాదిగామునులుగొంద, ఱుందపోనిష్ఠలువహించియుందురెపుడు. 73

క. వలసినకుసుమసమిత్కుశ, ఫలములుగొనితెచ్చి యిచ్చి బహుమతి వారిం
గొలిచి నిరంతరనిష్ఠా, కలితుఁడవై సేవ దపము గావించునెడన్. 74

సీ. తమతండ్రి శంబసాధనునిఁ జంపినయార్ష్య నవరించి తద్భ్రాతి శంఖశబళుఁ
డనువాఁడు మత్తేభమై కాలుమీఱి మా యాశ్రమస్థులకుపహాతి ఘటింపఁ
గర మూఁకఁగొని చివుక్కునఁ బైకి లంఘించి కుంభముల్ పిడికిటికొద్ది పొడిచి
గెడపిననవ్వనోయి! కేసరి వగుదు వీ వని భరద్వాజుండు నను నుతించి

తే. సర్వలోకోపకారి శాశ్వతబలుండు, నిర్మలుఁడు పుత్త్రుఁ డొకఁడు జన్మించు నీకుఁ
దప్ప దీమాట వేవేగఁ దగినకన్యఁ, బరిణయముచెందు మనుపల్కుఁ బల్కెనబల!

తే. ఆవయోజుని మాట వేదార్థమాట, నాఁటనుండియు మది పెద్ద నాటి యుండు
నైన సకలార్థములు దపం బాచరింపఁ, గలుగఁ దెలుపు బుధశ్రేణి కమలపాణి. 76

అంజన పెనిమిటియాజ్ఞచే వాయువునుగూర్చి తపంబుచేయుట.

ఉ. మానవతీలలామ! నియమంబు తపంబునకుం బ్రధానమా
నానియమంబు నిశ్చలహృదంబురుహంబునఁ గాని నిల్వదా
మానస మున్నచోటెఱుఁగు మారుతదేవత తత్ప్రసక్తిచే
మానికిఁ గల్గుఁ గోరినసమస్తఫలంబులు నట్లుగావునన్. 77

క. ఓ కోకసారము చెల్వెడ, లోకములకుఁ బ్రాణమైన లోకేశ్వరుఁడా
లోకింప వాయుదేవుఁడె, గాక తదన్యుండులేఁ డొకఁడు సేవింపన్. 78

సీ. చైతన్యసాక్షి నిచ్చలుఁన చిద్దేహేంద్రియముల చేష్టకు మూల మైనవాఁడు
కనిపింపరాకుండియును జల్వ వెదఁజల్లి ప్రజలతాపము తెల్లఁ బాపువాఁడు
వెలి గాక లోఁ గాక వివిధజంతువుల కాయుష్యంబు సాగింప నోపువాఁడు

... ... ...

తే. సృష్టిసంతుష్టియు విసృష్టి సేయువాఁడు, నఖిలజీవుల కాధార మైనవాఁడు
నన్నిచోటులఁ బరిపూర్ణుఁ డైనవాఁడు, వాయువే గాక మఱియు దైవంబు కలదె?

క. విశ్వవ్యాపకుఁ డగుటను, శాశ్వతబలుఁ డౌట నఖిలజంతుక్రీడా
ధీశ్వరుఁ డగుటను నీ కిఁక, విశ్వాసము పవనునందె వెలయింపఁదగున్. 80

చ. తరుణిరో! యాసదాగతి సదా గతిగా మది నుంచి ధ్యానత
త్పరత భజింపఁ బెక్కురుణ ధర్మ దయా బల కీర్తి సత్య స
త్త్వర మతి శాంతి కాంతి గుణ ధైర్య పరాక్రమ వేద శాస్త్ర వి
స్ఫురదణిమాదివైభవ విభుత్వహితుం డగు సుతుండు గల్గెడున్. 81

సీ. పలకాస్య వెతాను సైరించెదో కదే! బలువాన కాలంబు బట్టబయటఁ
అతికమాన పోటుకోర్చెదో కదే! మండు వేసవి నగ్నిమధ్యమమున
ఫాలాక్షు వెటుల నాలోకించెదో కదే! యనుపమాస్త్రములదాఁక నుగ్రకరుని
బ్రమసి ... భక్తి ప్రకటించెదో కదే! ఫలదాన యగువేల్పు పాదయుగళి

తే. నబల వేరేత నిర్భీతి నధివసింపఁ
గలవొ కదె! గండభేరుండ ఖడ్గ గండ
క ప్రకాండ ప్రచండమౌ కానలోనఁ
తెఱవ! నీ వాజ్ఞ యెట్టిదో! తెలియరాదు. 82

చ. వెలఁది! విను పుణ్యకస్థల మశేషతపఃఫలదాయి యచ్చటన్
నెలకొని గంధవాహు నతినిష్ఠ భజింపుము నేను నీకుఁ గా

పలసినకృత్యముల్ నడపువాఁడ మదాజ్ఞ సమీరదైవమున్
గొలిచిన నీగుణంబునకుఁ గొంచెముగా దని భర్త తెల్పినన్. 83

ఉత్సాహ. అంజనామృగాయతాక్షి ప్రాణనాథు వెంబడిన్
గుంజకస్థలంబు చేరి బోధరంజనున్ ద్విష
ద్భంజనున్ నిరంజనున్ బ్రభంజనుంగుఱించి ని
ష్ఠం జెలంగుచుం దపంబు సల్పఁగాఁ దొడంగినన్. 84

## గ్రీష్మఋతువర్ణనము.

తే. మెఱపు లోకవంక నివసించె మేఘపటల
మట్టె జడగట్టికొనె గాడ్పు కట్టువడియెఁ
జందురవి కున్ముఖతఁ జెందె జాలువాప
సిండి తపియించె నెలరాలు చెమ్మరించె. 85

స్రగ్ధర. కర మొప్పెన్ గ్రీష్మ మంతన్ ఘనమృగమృగయాకల్పనానల్పతేజో
భరఖిల్లీభిల్లభల్లప్రతిహతవిహరద్బ్రధ్నకుంభీంద్రకుంభో
త్కరదాపచ్ఛిన్నవేణూద్గతమణిసుషమాతారతమ్యప్రతీక్షా
పరకైకాయత్తవిద్యాధరమిథునవివాహక్షమాభృత్తటంబై. 86

శా. మాయాసంసృతి సత్యసంస్కృతిజనింపం జేసి పేరాసలం
గాయక్లేశము నొంది లోకులు కలంకన్ మించు కాంతేక్షణా
చ్ఛాయం బోలినజాల నాఁగ మృగతృష్ణం జూచి సారంగముల్
తోయభ్రాంతిఁ దపించె సంగఫల మెందుం దప్ప దెవ్వారికిన్. 87

మ. దినమేల్ స్నేహనియంధకారపటలింపన్నెంచ కాంత్మియగ
ఘనివాసంబున నూటు చేసిన ద్విషద్భావంబు భావించి పై
రినిరాసార్థము చండభానుఁడు ధరిత్రీదేవి ఖేదించెనో
యనఁ బాతాళము గానుపింప నెఱియల్ ప్రాపించెఁ జేలండలన్. 88

ఉ. రేదొర సొంపొసంగి సవరించినకల్వలజీవనోన్నతిం
బ్రోది యొనర్చె నం చలుక పుట్టి కొలంకుల నింకఁ జేసెఁగా
కా దెసఁ బద్మినుల్ గనులయందు గనం దనుఁ బెట్టిబంధువుల్
ఖేదిలినన్ విరోధుల దళింపక మానరుగా మహాప్రభుల్. 89

క. వాడెం బయిరులు కాఁకలఁ, గూడెం గొలఁకులు దవాగ్నిఁ గుఱనిచయంబుల్
మాడెం బ్రాణులపై నడ, యాడెం బలుసెకల గాడు పక్కాలమునన్. 90

ఆ. దుమ్ము కుమ్ము చటుల ధూర్జటినిటలవ
హ్నికీలి గాలి విలయకాలమృత్యు
దంష్ట్రికోగ్రరుచులవండ యొంద యఖాండ
పవనకేళి హా? కలఁపఁదరమె? 91

క. అట్టిదినంబులఁ గుంబరు, పట్టి మదిం గాడ్పు వెట్టి పట్టినప్రక్రమున్
గట్టిగఁ గొని పంచాగ్నుల, నట్టనడుమ నిలిచి తప మొనర్చుచు నుండెన్. 92

వర్షఋతువర్ణనము.

సీ. కేతకీతరువాటి కేళికాగృహకోటి భోగిసంఘాతంబు పొందు చేసె
శరశీకరాసక్తి సరసీరుహావియుక్తి సారంగసంఘంబు సంభ్రమించె
గగనాంకరాళంబు గహనాగజాలంబు శిఖిశిఖామేళనస్థితి వహించె
మానసాంబుక్రీడ మాలతీతతి తోడ కాదంబవిభవంబు గ్రమ్ముకొనియె
తే. వితతపరివేషసందీప్తవిగతమైత్ర, గమనలీలాప్తి నినమండలము పొసంగఁ
బక్క దక్షిణముగను బర్జన్యుఁ డసిత, తోయదహయాళి పయ్యాళిఁ దోలువేళ. 93

తే. స్తనితఘోషలు భువనప్రశస్తధార
లచిరరుచికైతవాంశాభిహతులుఁ గలిగి
మలయుమబ్బుకరాళి సామ్రాణి యుప్ప
రాటలుకొనసాగఁ గడఁగి పర్జన్యశిక్ష. 94

మ. తనయభ్యున్నతియంచె కాని యితరోద్యద్వేళలం జెంపుసొం
పును బ్రాపించని చాతకద్విజచయంబున్ గర్జితస్ఫూర్తిఁ బి
ల్చి నిజస్వర్ణము నిచ్చి తృప్తి మొనయించెన్ భూరిధారాగతిన్;
ఘను లార్తాళికి జీవనంబొసఁగరే కాంక్షించియున్నన్ ఘనుల్! 95

మ. తొలుతం దాను బ్రదాన మియ్య జలసస్తోమంబు ప్రాపించి భూ
స్థలి వర్షించిన జీవనీయము సరిత్ప్రాప్తిన్ ప్రవాహంబులై
కలయం బొంగు వహింపఁడయ్యెఁ దటినీకాంతుండు గాంభీర్యవం
తులు దా రిచ్చినయీవి తమ్ము దొరయన్ లో నుబ్బఁగా నేర్తురే? 96

క. శంపాలతకుం గాయుం, గ్నంపాతనవాంబుధార ఖద్యోతవిభా
సంపద గనిశెంపదు నిశఁ, జెంపకుఖద్యోతకాంతి జెరయంటు పక్కన్. 97

తే. నవ్యపుష్కరపూర్ణనానాసరముల, రాజహంసలయాత్రల రహి వహించు
వాహినులకల్మి వనచరోత్సాహగతుల, శారదస్ఫూర్తి జలదావసరముఁ బోలె. 98

ఉ. తాదృశదుర్దినంబుల నుదగ్రశిలాస్థలి బట్టబైట నే
పాదుగ నిల్చి పై నశనిపాతము లొందునొ! వర్షధారలన్
ఖేదము బొందునో! యన కకృత్రిమభక్తి మదిన్ సమీరు శ్రీ
పాదము లుంచి యాఘనతపస్విని నిశ్చలనిష్ఠ నున్నెడన్. 99

## శిశిరఋతువర్ణనము.

చ. వెలఁదులమందహాసముల వేడుక లొందుట చంద్రికాస్థితిన్
వలపరు ముద్దుగుమ్మలసుధామధురాధరతృప్తిఁ బానకం
బులు నవి గొందు రంగనలచొక్కపుఁజన్నులనుక్కు పేరెకా
పులవిపులోపరిస్థితిఁ బొసంగరు కాంతులు శీతవేళలన్. 100

ఉ. చొక్కపుగింటెపుంగవముసుంగులు సొంపు లొసంగ మేను మే
లొక్కటియైనలీల బిగివొందఁ గవుంగిట నుంచి ముద్దిడన్
జక్కటివీడియం బొసఁగి మోహపుటింతులగుబ్బసందులం
జెక్కుడు సీతు లేమి సుఖయించిరి పుణ్యులు గొప్పరాత్రులన్. 101

ఉ. ఎప్పుడు గాలికిందలఁకి నింతయు నోర్వనిప్రాణికోటులన్
జెప్పక మూలమూలల వసించుట నైజము వేఁడివెల్వ నా
నొప్పెడుకప్పుఁ ద్రోసదొరయున్ చలి స్రుక్కి హసంతికాఛలం
బుప్పతిలం గురాళముల నొంచెడుపాన్పులక్రింద వర్తిలున్. 102

తే. ఆదినంబులఁ గంటకస్నానంబువులను, నిలిచి నడఁ గింతయును లేనినిష్ఠ పూని
తపముగావించుఁబవఁతితజ్ఞుద్వార్భకెదుట, దినమొకఫలంబుపవనుండు తెచ్చియిచ్చె. 103

క. ఊరకయుండిన దైవం, బేరీతి నొసంగు నంచు రెఱుఁగనిపూనన్
భారము పై వైచినసం, పారికి దైవంబు ఫల మొసంగక యున్నే? 104

క. ఈలీల బాల తప మతి, వేలఁధృతిన్ సలుప నేడువే లేండ్లరుగన్
మేలని పుత్రార్థిని యగు, నీలాలక మెచ్చి యయ్యనిలదేవసయమున్. 105

## వాయుదేవునియనుగ్రహమున నంజన గర్భముధరించుట.

ఉ. ఇందుకళాధరుండు ధరియింపఁగ ముందిడినట్టితేజ మ
య్యిందునిభాస్యకోర్కి ఫలియింప ఫలాకృతిఁ జెంత నుంచి పో
వం దరుణీలలామ ప్రతివాసరలబ్ధఫలంబె యంచు నా
త్మం దలపోసి లోఁ గొనినఁ దచ్చివతేజ మమోఘమౌటచేన్. 106

సీ. స్తనచూచుకములు కృష్ణవిలాసరతిఁ జెందెఁ దేటచెక్కులు కౌముదిని గరించె
వెలసె పృష్ఠశ్రేణి వేకస్ఫురణఁ గాను కామగమోదవృత్తిఁ గనియె మనము
ఘను వలంకారసంపత్ప్రవర్ధన మొందె గమనంబు మాంద్యసక్రమముఁ జెందె
భరతవిస్ఫూర్తిఁ జొప్పడియె గర్భవిభూతి చండమారుతలీల నిండెనూర్పు
తే. లఖిలవిద్యానవద్యహృద్యావతారుఁ, డగుకుమారుకళాలీల లధివసింపఁ
బట్టు చాలక సిరారి బయలుదేఱె, ననఁగ నంజన గర్భచిహ్నములు దాల్చె. 107
క. ఈరీతి గర్భ మొదవిన, నారీతిలకంబు గని మనంబున నిదియే
కారణమునసో యని నియమాంఛము మాని విస్మయాన్వితమతి యై. 108
తే. పుట్టినింటికిఁ జొచ్చినయట్టియంటి, కకట! వికటయశస్ఫూర్తి నికట మొందె
నెటుల ఘటియిల్లె నిటువంటికిటుకు నటులు, కటికివేఁకటి సైకతకటికిఁ గలదె? 109
ఉ. పట్టి జనించు నంచును బ్రభంజనుఁ డెంచుట లేదు డెందమున్
బట్టినయట్టి గట్టినియమస్థితి యిట్టటు నెట్టుకొట్టఁగా
నిట్టియెడన్ నిశేశు రమియింపఁగఁ దొట్టడియిట్టిపోఁడుముల్
నట్టడవిన్ ఘటిల్ల నగునా? తగునా? ననుబోఁటిబోటికిన్. 110
ఉ. ఎమ్మెయు జవ్వనంబు గలయింతి పతిం బెడబాసి యొంటిగాఁ
గ్రిమ్మరుచోట గర్భము ధరించినదన్నను గన్న విన్నవా రె
మ్మెయిఁ గల్ల లేమి గణియింతురొ యెంతురొ బంధుకోటిలో
నమ్మకచెల్ల! నానియమ మాగడ మాయె నిఁ కేమి సేయుదున్? 111
తే. కటకటా! మన సెఱుఁగనికల్ల యొదలు, మఱవినసిదంబు లేదండ్రు మహితలమునఁ
గలిగె నావల్ల నేవల్లఁ బలుకుదాన, భర్తతోనని పరితాపభరిత యైన. 112
క. సారపుఁబలుకులు నవక, ర్పూరపుఁబలుకులతలంపుఁ బుట్టింప సుధా
పూరపుఁజెక్కుపనక్కుచ, భారతిమిరవతికి గగనభారతి పలికెన్. 113
సీ. "ఓబాల! నీ కేల యూరక చింతిల్ల మున్నువానరరూపమున శివుండు
వనలీల మొనయుకామినిఁ గూడి నిజతేజ మామెకు మోయ శక్యంబుగామి
భరియింపుమని మహాబలునియం దుంచిన ననిలుండు బహుకాల మది ధరించి
యట దొల్లి నీహృదయాబ్జసంగతుఁ డౌటఁ బ్రతిదినంబు నొసంగు ఫలము లీల
తే. మునుపరను వైవ లోఁగొంటి వందువలన, నమ్మ! నీగర్భయుక్తిఁ బ్రత్యక్షశివుఁడు
పెరుఁగుచున్నాఁడు గాదు ప్రగర్భీకరించెఁ, గాన వాయుజుఁడను పేరుగాంచు నితఁడు.
ఉ. ఈవరగర్భశుక్తి జనియించు కుమారకరత్న మార్యసం
భావితదివ్యకీర్తి సురపాలకఫాలకిరీటఘాటన్నో

భావహామూర్తి సర్వజగదంచితభవ్యగుణానువర్తి నా
నావిధరామకార్యఘటనాహృతనమ్రజనార్తి" యం చనన్. 115

ఉ. అంత సమీరదేవత నిజాకృతిఁ జూపి నభస్సరస్వతీ
కాంత నిజంబె పల్కెఁ గలఁకం బడ నేటికి? బోటి! యీపిథం
బంకయుఁ జెల్వు నీవిభున కం చతఁ డేఁగిన నయ్యుదంత మా
ద్యంతము కాంతుచెంతఁ దెలియన్ వినిపించి సుఖించుచున్నెడన్. 116

## ఆంజనేయజననాదివృత్తాంతము.

క. ద్వాదశమాసము లేఁగిన, నాదట సూర్యాదికగ్రహశ్రేణి శుభ
ప్రాదుర్భావస్థలములఁ, బాదుకొనిన యొకత్రిలోకపావనవేళన్. 117

సీ. నిడుదవాలమువాని నెలఁబొల్పుతలనిల్పుబలువేల్పుతులవేల్పుబలిమివానిఁ
బచ్చచూపులవానిఁ బగడంపుటిగిసొంపు బెగడింపుమైచాయ జెడఁగువాని
కొంటెఁజంపెమువాని నొఱపుంచునెఱమించు మఱపించుబంగారుమూంఁకివానిఁ
గండలద్యుతివాని గురుహారహారహీరశరశాంకదాకీర్తి గరిమవాని

తే. మంచిమదివానిఁ గ్రొంబట్టుపంచెవాని, మంచుమల గొంచుదిట వావరించువాని
వడుగుఁబాపనిచిన్నారిబుడుత నొకనిఁ, గాంచె నావేళ నంజనాకాంచనాంగి. 118

తోటకము:—

మొరసెన్ సురగోముఖవాద్యతతుల్
నెఱసెన్ మలయానిలలోలగతుల్
విరిసెన్ బలుకాపిరి నద్దెసలన్
సురిసెన్ విరు లగ్గురులగ్నమునన్. 119

శా. తత్కాలంబునఁ దండ్రి గర్గనియె నార్తత్రాణసంచారి సంప
త్కౌతూహలకారి సూరిజనసంభావ్యశ్రుతాచారి శ్రీ
ల్లత్కారుణ్య హృదబ్జచారి నలబాలబ్రహ్మచారిన్ మరు
త్కుక్షిస్థిరతానుసారిసుమతిత్వణ్ణాంతరారిన్ హరిన్. 120

భుజంగప్రయాతము:—

విలోకించి లోనన్ వివేకంబుతోడన్
బలా! నేఁడుగా! మాతపఃపుణ్యలీలల్
ఫలించెం జలించెన్ విపత్కోటు లంచున్
వలంచెన్ బుధారాధనం బాచరించెన్. 121

మత్తకోకిల:—

కన్నతల్లి కుమారశేఖరుఁ గౌఁగిలించుచు రార నా
కన్నతండ్రి తపఃఫలాకృతి గౌరినోములపంట నా
చిన్నిముద్దులకూన! యించుక సేపు పో రిడకుండు మా
యన్న యాఁకలి దీఱఁ బండ్లు వనాంతరంబునఁ దెచ్చెదన్. 122

పంచచామరము.

కృశాంగి పట్టి నిట్టులాదరించి కోమలప్రవా
ళశయ్యఁ బర్ణశాలలోపలన్ ఘటించి యందుపై
శిశూత్తమున్ వసింపఁజేసి శీఘ్ర మేఁగుదెంచెదన్
నశాంతలీల నొందు మంచుఁ జాన కాన కేఁగినన్. 123

క. ఆచిన్నపాపఁ డాఁకట, వాపోవుచు జననివెనుక వాయుసమగ్ర
వ్యాపారసత్వరోద్ధతి, దీపింపఁగ జనుచుఁ దూర్పుదెసఁ గనుఁగొన్నన్. 124

సీ. హైరణ్యకూటప్రభాఖర్వపూర్వక్ష్మాభృచ్ఛిరోరత్నమకుటమనఁగఁ
దివిరి ప్రపంచాపహామహోగ్రసమయేశసంఫుల్లఫాలలోచన మనంగ
నమితలోకాయుష్యసుమనార్థవిధిక్లప్తరత్నసంఘట్టఘరట్ట మనఁగ
క్ష్మాసురోపాస్తిప్రసన్నతాసన్నగాయత్రిసువర్ణసింహాసన మనఁ :

తే. బొడుపుమలచక్కిఁ గరకర పొడిచి యట్టె యుట్టిపడ్డట్టు లరుదెంచుచున్న భాను
బింబ మరుణారుణప్రభబింబలీల, నాశపుట్టింప గేవలశైశవమున. 125

క. తొట్టిన యాఁకటిచెట్టను, నట్టిట్టు గణింప నెఱుఁగ కది ఫలమనుచున్
బుట్టినదిట్టతనంబున నట్టె యెగసె గాడ్పుపట్టి యాకసమునకున్. 126

మ. శరధుల్ ఘూర్ణిల దిక్కరీంద్రములు మూర్ఛం జెందఁ గ్రందొంప నం
బర మంభోరుహగర్భచిత్తము భయోత్పాతాప్తి క్షోభింపఁగా
శరభం బంబరె గర్జ సేయుచు జగత్సంహారవేళాభయం
కరకూలాయుధుఁ డోక్కో! నాఁగ నతఁ డాకాశంబునం బోవుచున్. 127

స్రగ్ధర. వాలం బల్లార్చినంతన్ వడి నెడి జడదవ్రాతముల్ తూల లీలం
దూలెన్ నిర్ఘాతకోటుల్ తొరఁగె సురిఁగె నల్ త్రోవలన్ దేవపఙ్క్తుల్
రాలెన్ దారల్ విమానవ్రజరుచిరరుచిప్రస్ఫురద్రత్నఘంటా
జాలానోన్యైకసంఘర్షణ ఘణ ఘణ నిస్వానముల్ సాలఁ గ్రాలెన్. 128

క. ఆవేళ నతఁడు శౌర్యర, యావేలమహోద్ధతులు భయాద్భుతలీలల్
గావింప యక్ష రాక్షస, దైవత ఫణి సిద్ధ సాధ్యతతి దమలోనన్. 129

సీ. అఖిలలోకశ్రేణి నాహుతి గొనఁబూని ప్రళయాగ్ని యీలీలఁ బ్రబలెనొక్కొ?
నిఖిలాంత్యకాలాభ్రనిర్భేదఝుంఝూసమీర మీరూపున మీఱెనొక్కొ?
యప్రతీపప్రతాపాటోపగతిఁ జూప విలయార్కుఁ డీలాగు వెలసెనొక్కొ?
కాండంబు నిండఁగే యండంబుఁ జెండాడ నాభైరవుం డిట్టు లయ్యె నొక్కొ?
తే. కానిచో నిట్టిదుర్నిరీక్ష్యప్రభాజవప్రతాపోగ్రగతు లెట్టివారియందుఁ
గంటిమే వింటిమే తొంటికలలనైన, నిదిమహాద్భుత మీవీరుఁ డెవ్వఁడొక్కొ? 130

ఉ. ఇక్కడ నక్కడం గన కొకించుకఁ గొంచ కనర్గళత్వరన్
దిక్కులు వ్రయ్యఁ దోఁక వడిఁ ద్రిప్పుచుఁ బోవఁగ మేనిగాడ్పుచే
నక్కట! నుగ్గులయ్యె జలదాళి విమానము లింక వీనిచే
నెక్కడి పద్మజాండ మని యేఁగిరి దిక్కుమొగంబులై సురల్. 131

మ. విచలద్వాలముతోఁ దరంగితవళీవిస్పష్టఫాలంబుతో
రుచిమద్ఘర్మకణాన్వితాననముతో రోదోంతరోద్భేదకా
ర్యచణావార్యరవంబుతోఁ బవనతార్క్ష్యాశ్చర్యకృత్సత్వర
ప్రచురాహంకృతితో నతండు రవిబింబప్రాంతముం జేరఁగన్. 132

క. తెఱగంటియేటితరఁగలఁ, దరలనిరాయంచజక్కు దరియ దొరఁగఁ దా
మరతేనెచలువతావుల, నెరసి విసరె గాడు పెంత నెనరొ నిసువుపై. 133

చ. తనవెనువెంటఁ గ్రొంజలువతావులఁ జల్లుచుఁ దండ్రి తోడు తా
వెనుకను ముందుఁ గన్గొనక వేఁడిమిగా యనఁబోక లక్షయో
జనము లతిక్రమించి చని చయ్యన నయ్యినమండలంబుఁ దూ
ఱినఁ గని యెప్పు డయ్యెడఁ జరించుదివాకరపారిపార్శ్వకుల్. 134

శా. మాంపాహీతివచస్కులై భయమునన్ మాటాడలే కంగముల్
గంపింపన్ జపమాలికల్ విడిచి సాక్షాత్కాలరుద్రక్రియా
సంపన్నుం డిదె వచ్చె లోకము గ్రసింపం బూని యిమ్మేటికిన్
సంపశ్యామి వచింపవే శుభకటాక్షం బుంచవే మాయెడన్. 135

ఉ. నిస్తులదేహదీప్తులను నేత్రము లంధము లయ్యెఁ గాల మే
ఘస్తనితాధికార్భటులఁ గర్ణములుం జెవుడొందె శత్రుసం
త్రస్తమనస్కులన్ మము ననన్యశరణ్యులఁ జూచి యీయెడన్
స్వస్తి యొనర్పవే యనెడువారికి వారిజమిత్రుఁ డిట్లనున్. 136

ఉ. ఈతఁడు సర్వలోకహితుఁ డీశ్వరవీర్యజుఁ డాంజనేయుఁ డ
త్యాతతబాహుశౌర్యనిధి యయ్యును గేవలశైశవంబుచే

నీకఱి నన్నుఁగన్గొని ఫలేచ్ఛ గ్రహింపఁగ వచ్చె నిందునన్
భీతిలనేల? యంచు వినిపింపఁగ నజ్జగజెట్టి యట్టిచోన్. 137

క. పం డుండఁ జేరి కన్నుల, పండుగుగా నేఁడుచూడ బడసితి ననియు
ద్దండతఁ గవిసిన రవి వే, ఱొంటిశోకమున వేఁడి చూపకుండె నెవరునన్. 138

క. అంత నతఁ డరుణకమలము, దంతికిఁ బువ్వు తవియున్నట్లు దారుణఁ గేలం
గొంచ వెవలించి నలిపి, కంఠం గబళించి పట్టె వట్టడి యగుచున్. 139

క. ఇట్లు నటుమాచి ముఖమున, నట్టె యొకటనుంచివేఁడి యైనను వెడలం
బట్టికొని కేలఁగొట్టినుఁ, దిట్టియు వెసఁబోయి మఱియుఁ జెమలించు నెడన్. 140

శా. ఆస్వర్భానుఁడు నాఁడు పర్వదినమా టాభీలనిర్ఘాతని
ర్ఘుస్వానోచ్ఛలితాఖిలాంశుఁడయి హూంకారంబు ఘోరంబుగా
భాస్వంతున్ విపృతాస్యయుక్తిఁ గబళింపం బూని దుర్వారగ
ర్వస్వాతంత్ర్యనిరూఢి మీఱి పఱతేరంజూచి సామీరియున్ 141

శా. కల్పాంతాగ్రహసద్ఘర్ఘరజాగ్రద్వ్యగ్రథకార్భటీ
కల్పానల్పభయంకరారవమునం గర్జించి ధైర్యచ్యుతిం
గల్పింపం దిగు లొంది కుంది యట చక్రం జూడ శంకించి సం
కల్పక్షోభముఁ జెంది రాహు వుఱుకంగాసాగె వేగంబునన్. 142

క. వెఱపింపఁ బోయి వెఱచిన, తెఱగున నెఱి దఱిఁగి తిరిగి తిరిగి కనుచు సి
ద్వైర నివ్విధ మింద్రున కిక, సఁగున నెఱిఁగింతు ననుచుఁ జని స్వర్గపురిన్. 143

సీ. జంభాదిదైతేయజయకథల్ వాగడువిద్యాధరస్తుతివిన్కి సడరుసొంపు
తుంబురునారదాదులవీణాలఁదొరంగుగానామృతంబునఁ గాంచుసొక్కు
బీరుదు లొందినవేల్పువిరిబోఁడిరతనాలవింతకోపులచూడ్కి వెలయుమెప్పు
నలికకీలితహస్తులై కొల్చుతెఱగంటిదునెదార్లఁ గడకంటఁ గనెడు పెంపుఁ

తే. దగసుధర్మాసభాస్థలాంతరనితాంత, పృథులచింతామణీభద్రపీఠియందు
నిండుకొలువుండు దేవతామండలేశ్వ,రునిఁ గనుంగొని రాహు వి ట్లని వచించె. 144

ఉ. మేటిగుణంబు నీయెడనె మించె మఱే మనవచ్చు నిచ్చలుం
బాటలగంధు లింపెసఁగుపాటల నాటలఁ జేటమాటలం
బాటిలునీటులం జెలివి మాటినజాణతు నీకు నున్న జం
జాటము లేల యన్న విని శక్రుఁ డదే మన రాహు విట్లనున్. 145

ఉ. ఈలువుమాలి తెల్పెద సురేశ్వర! పర్వము గాన నేఁడుషః
కాలమునన్ రవిం బొదువఁగాఁ జన నంతకు మున్న వచ్చినా

పాలికి దాయ యై రవిని బట్టినవాఁ డొకవింతరాహు వే
సేల యిఁకన్? రవీందుల గ్రహింపఁగ వేఱొకరాహు వున్నెడన్. 146

క. ఈక్షింప నుఱిమి తఱిమిన, భక్షణమం గాక మరలి బ్రతికితిని సహ
స్రాక్ష! జనుల్ రాక్షసికిని, బ్రోక్షసి యనుమాట సత్యముగ నేఁ టవెన్. 147

క. సత్యపతి నీవు నను మును, ప్రత్యబ్దము భాను శీతభానుగ్రసన
స్థిత్యాఖ్యఁ జేసి యొండొక, యత్యున్నతుఁ బన్ననాయ మహా సే యనినన్. 148

క. మిట్టపడి మనువుఁ డేమో?, యిట్టి తెరంగెఱుఁగ మెన్నఁ డిపు డొకఁ డినునిం
బట్టెనె? నను నెట్టనె విధి, కట్టడ దప్పించు టెంత కైవస మయ్యెన్? 149

శా. ఓహో! ఱేలు విచార మీ వెఱుఁగవే యున్మత్తవృత్రాదిదై
త్యాహంకృత్యపహృత్యుదగ్ర మగునాహస్తాసి? రక్షించు నా
రాహుం బల్కి సితేభ మెక్కి కయి వజ్రం బించ సాధ్యాగ్రణీ
సాహోనాదము మించ వేగము రహించన్ జిష్ణుఁ డేతేరఁగన్. 150

ఉ. నిర్జరరాట్సహాయమున నెక్కొను పెక్కువ నిర్జితాంబుభృ
ద్గర్జితతర్జనార్భటి సదాగతిసూతి సెదిర్చినంత న
య్యూర్జితశౌర్యుఁ డాగ్రహమహోగ్రత నాగ్రహవక్త్రి మెట్ల నై
గర్జిల మంచిపం డని యొగాదిగఁ జూచి గ్రహించువేడుకన్. 151

క. విస్మృతానుఁడై కహకహ, రవమఖిలదిగంతముల నొరయ నుగ్రనృసిం
హవిధమున మరుద్గారుడ, జవగతి పై నుఱుక నిలువఁజాలక భీతిన్. 152

క. స్వర్భానుఁ డుదిగ్భ్రమఁ గొని, స్వర్భువనాధీశుఁ జేరి చంపఁగడగ నీ
యర్భకుఁడిదె ననుఁ గైకొని, నిర్భీకునిఁ జేయవే యనిన సురపతియున్. 153

క. ఇంతభయంపడ నేల? విధుంతుద నాచేతికత్తిఁ దుత్తుమురుగఁ గా
వింతున్ నీకు ముదంబుగ, డింతుం గను మనుచు దంభ డీకొల్పుటయున్. 154

క. అభ్రంకషఘీంకరణా, దభ్రరవభ్రమితవలయధరణీధర మై
యభ్రముపతి సంభృతమద, విభ్రమగతిఁ గాలు మీఱి వెసఁ బై నడిచెన్. 155

క. ఈషండు ధవళదీప్తుల, దీపించుట దీనిఁ దినఁగ దీపించుటొధం
దీపించు నంచుఁ దా నిలఁ, బ్రాపించి క్రసించ నెంచి పాయనివాంఛన్. 156

తే. బాహుబలభూతి శ్రీగంధవాహసూతి, ప్రళయఝంఝాసమీరంబుఁ బోలిఁ గదియ
నభ్రమాతంగమును శారదాభ్రరీతి, భీతిఁ దెరలిన జంభారియాతి కనలి. 157

క. శతకోటికల్పితాశని, శతకోటికఠోరధాటి జళిపించి మరు
త్సుతు వైవ హనువు పగిలిన, నతఁ డుదయాద్రిపయి వివశుఁ డైనటు లున్నన్.

క. అంత సమీరుఁడు చింతా, క్రాంతస్వాంతాబ్జుఁ డై జగజ్జనబాహ్యా
భ్యంతరసంచారము లే, కెంతయుఁ గ్రోధించియున్నయెడ నిచ్చోటన్. 159

—అంజనాదేవి యాంజనేయుని గానక చింతిల్లుట.—

క. మే లెంతయుఁ దా నై తగు, బా లెంతయు మరలివచ్చి పానుపుమీఁదన్
బాలునిఁ గానక ధృతి చెడి, నేలం బడి కొంతవడికి నిట్టూర్పడరన్. 160

మానిని.
హా కులభూషణ! హా గళితేషణ! హా కలభాషణ! హా కొమరా!
యాకడ నిన్నిడి యావనికిం జన నెక్కడఁ బోయితి వింతటిలో
నాఁకటిపెల్లున నారటఁ మందఁగ నక్కట! వన్యమృగావళి ని
న్నే కడకుం గొనిపోయెనొ యే మని యేమని దూఱుదు నింక విధిన్. 161

క. తల్లి యిఁక ఫలము లిడునని, యుల్లంబున నెంత నమ్మియుండితివో నేఁ
జెల్ల కుమారక! రారా, యెల్లరుచుల్ గలుగుఫలము లిచ్చెద నీకున్. 162

క. ఆటలకు డాఁగినావొ మ, హాటవి నొంటిఁ విడిచనుట కలిగి తొలఁగితో
పాటించి యిపుడు నాతో, మాటాడవ దేమిరా కుమారక! చెపుమా. 163

తే. నేను నోఁచిననోములు నేనొనర్చి, నట్టితపమును నేఁడు నీపుట్టినందు
వలన ఫలియించెననియుత్సవంబు చెంది, యుంటి నింతటిలో దైవమోర్వదయ్యె. 164

వ. అని బహుప్రకారంబులఁ బలవించుపికాలాపినిం గని త్రికాలజ్ఞానఖని యగుకేసరి
యిట్లనియె. 155

—కేసరి యంజన నూఱడించుట.—

తే. జాలిఁబడ నేల బాల! నీ బాలకుండు, బాలభానుని ఫలమని పట్టుకొనిన
రాహు వెఱఁగింపనింద్రుఁడాగ్రహముమించ, హనువుభేదింపనుఁడయ్యాద్రి నవశుఁడయ్యె.

క. ఆపనికి దేవవిభుపైఁ, గోపముఁ బ్రాపించి గాడ్పు కొడుకునకు శుభం
బాపాదింపఁగ సుభగ, వ్యాపారము మానియున్నవాఁడు లతాంగీ! 167

తే. సకలమహిమలు నీదుపట్టికిని జేకు, అంగలా వంగలార్వఁ గురంగనయన!
వలదనిన ఖేదమోదభావంబు లైక్య, మొంద నవ్వేళ కొంకయింత యూఱడిల్లె. 168

వ. అంత. 169

—దేవతలప్రార్థనవలన బ్రహ్మ హనుమంతుని మనుచుట.—

శా. సర్వప్రాణులప్రాణముల్ పవనుఁ డాచ్ఛాదింప నిస్త్రాణులై
గీర్వాణుల్ వెఱ నుక్కి బ్రహ్మఁ గని భక్తిన్ మ్రొక్కి బాహ్యాంతరా

ఖర్వక్రౌర్యము గాంచెనేమొ తగవింకన్ గాడ్పు నీవింకఁ ద
ద్దుర్వారార్తి హరింపవే యన సురస్తోమంబుతో ధాతయున్. 170

తే. గట్టుపగదాయ తనపట్టిబిట్టుగొట్ట, నిట్టిచలమూనెఁ బవమానుఁడింక నతని
గట్టిగా నేను వేఁడినఁగాక కాఁక మానఁడని బ్రహ్మ తద్వంద్యమానుఁ డగుచు. 171

ఉ. రిక్కలతెక్కు ద్రొక్కు తెలిఱెక్కలపక్కిహుమాయి నెక్కి పెన్
మక్కువ నక్కఱంబుచెలిమాటలపెక్కువ నిక్కువేల్పు లిం
పెక్క భజింప గాడ్పుకడకేఁగి కడానిమెఱుంగుబోఁడిరాపా
క్కిటిపాప పంచనపుబొజ్జయగారు వచించె నేర్పునన్. 172

క. సకలజగత్ప్రాణుఁడవై, సకలజగజ్జనవిహారసంధాతవు నై
సకలాత్మలఁ గలసీకును, సకలాత్మక! యింతకినుక సనునే యనినన్. 173

మ. పరితాపంబుదొఱంగి తెమ్మెరయు జంభద్వేషిదంభోళిదు
ర్భరధారాహతిమూర్ఛపాల్పడినలేఁబట్టిన్ మరల్ పుట్టఁ దాఁ
గరయుగ్మంబునఁబట్టిచెచ్చెర వచఃకాంతామనఃకాంతు శ్రీ
చరణాంభోజయుగంబుపైనిడి నమస్కారంబు గావించినన్. 174

ఉ. స్వస్తియొనర్చి వాయుజునిచక్క గనుంగొని యాతఁ డార్యవ
ర్యస్తవనీయశౌర్యుఁడని యాతని మేను సరస్వతీలతాం
గీస్తనపద్మకోరకమృగీమదపత్త్రవిచిత్రలేఖన
ప్రస్తుతహస్తపద్మమునఁ స్పర్శ మొనర్చినయంతలోపలన్. 175

తే. పూర్ణిమాచంద్రకరసుధాస్ఫూర్తి వాఁడి, పడినసస్యంబు క్రమ్మర నడరుకరణి
నాంజనేయుండు దేహదాహంబుమాని, చెంతఁజేరలాడఁజూచి రాజీవభవుఁడు. 176

మ. ఫలకాంక్షాహృతబాలసూర్య! గిరిశుంభద్ధైర్య రావోయి యం
చెలమిన్ దగ్గఱఁజేరి యెత్తికొని మోమీక్షించి ముద్దాడఁగా
బలుసంతోషము గాంచి గాడ్పు మరలన్ భాషావధూభర్తయుం
ఘుశ్రీలకున్ మ్రొక్కి పదాజ్ఞ నెప్పటి తెఱంగుం గాంచె లోకంబులన్. 177

ఉ. ఈగతి గాడ్పులోకముల నెప్పటిలాగున నిర్నిరోధలీ
లాగతి సంచరింపఁ గమలప్రభవుండు మరుద్ధితార్థియై
శ్రీగిరిజాధినాథ సురశేఖర వాయుసుహృత్పరేతరా
ట్సాగరరాజముఖ్యదివిజప్రభులం దిలకించి యిట్లనున్. 178

## బ్రహ్మాదు లాంజనేయునికి నలభ్యము లైనవరము లెల్ల నిచ్చుట.

శా. ఓదిక్పాలకులార! యీపవనజుం డూహింప లోకత్రయా
మోదప్రాప్యముఁ జేఁట నిత్తము వరంబుల్ మీఁరటన్ సౌఖ్యమా
పాదింపంగలఁ డాప్యులాత్మలను సంభావింపఁగా శంభుఁడే
ప్రాదుర్భావముఁ జెందె నిట్లనిన గీర్వాణుల్ ప్రమోదించుచున్. 179

సీ. తమకింప వేదశాస్త్రములు వచ్చునటంచుఁ దనతోడితేజంబుఁ ధరణి యిచ్చె
నిజపాశములచేత నీట నిర్భయుఁ డుగా వరుణుండు కరుణతో వరములిచ్చెఁ
గాలదండము మృత్యుగతి రుజల్ సతతంబుఁ బొరయనివర మర్కపుత్రుఁ డిచ్చెఁ
దనచేతఁ దనయాయుధములచే విశ్రాంతిఁ బాసనిమహిమ మీశానుఁ డిచ్చె
తే. నని జయం బిచ్చి తనగదాహతికి వెఱవి, మనికి ధనపతి దయచేసె మును స్వనిర్మి
తంబులా శస్త్రములభీతి దక్క నొసఁగి, కనకకుండలములు విశ్వకర్మ యిచ్చె. 180

మ. కనదంభోళి హనుస్థలిం బెరసియుం గారింప లేకుండుటన్
హనుమంతుం డను పేర మీరు నని జంభారాతి వజ్రాయుధం
బున నిర్భీకుఁడుగా వరం బొసఁగె నంభోజాసనుండుం జిరం
తనదీర్ఘాయువు మానిశాపతరణౌద్ధత్యంబు నిచ్చెం దయన్. 181

క. అనలాదినిర్జరేంద్రులు హనుమంతున కిచ్చి రంత నంచితవరముల్
వనజాసనుండు గ్రమ్మఱ ననిలు నిరీక్షించి యప్పు డరుదుగఁ బల్కెన్. 182

ఆ. అనఘ! నీకుమారుఁ డమలకీర్తివిహారుఁ, డజితుఁ డేకవీరుఁ డద్రిధీరుఁ
డఖిలజగదుదారుఁ డాత్మతత్త్వవిచారుఁ, డాంతరారిదూరుఁ డనఁగ మీఱు 183

సీ. అణిమాదు లప్రతిహతము లై తనుఁ గొల్వ నొకరికుత్పాదింప నోపు నితఁడు
కమలజాండము నిరర్గళమనోవేగంబు కలిమి నెంచినమాత్రఁ గాంచు నితఁడు
సతతవైరాగ్యోపరతుల నిష్కాముఁడై కామరూపముఁ బూనఁగలుగు నితఁ
డనివార్యశౌర్యధైర్యదయాదిసద్గుణస్తోమంబులకు జన్మభూమి యితఁడు
తే. కడువిచిత్రక్రియల్ సేయఁగలఁ డితండు
మహిమ నఘటనఘటనాసమర్థుఁ డితఁడు
రామకార్యార్థమై పూని రాక్షసాళి
నెల్ల హింసించి పతికి మే లిచ్చు నితఁడు. 184

ఎన్ని యని సన్నుతించెద, నన్నా! నీచిన్నవానియద్భుతలీలల్
కన్నులఁ జూచెద వీవే, యన్నియు నని సనియె విధి నిజాలయమునకున్. 185

సీ. ప్రతిలేని తనప్రతాపము దెల్పుటకు నింతపని చేసెఁగాబోలు ననెడువారు
కాదులే తనకాంతిగతిఁ దోఁచిన నసూయ నరుదెంచి కబళించె ననెడువారు
దనత్రిమూర్త్యాత్మకత్వమహత్త్వ మతిశయం బగుట నిక్కముచేసె ననెడువారు
నన్యగోళాధీశుఁ డగు టెఱుంగనిరీతిఁ దనుమార్ఘ్య మొసఁగించె ననెడువారు
తే. కాక బాలుర కీజోక లోకములను
గలదె? యనువారునై నిర్జరులు గణించి
కొనుచుఁ దమలోకముల కేఁగఁ గొడుకుఁ గొనుచు
నంజనను జేరఁ జనుదెంచె ననిలుఁ డపుడు. 186

వాయుదేవునను గ్రహముచేఁ దనవద్దకు వచ్చి చేరినకొడుకు నంజన లాలించుట.

తే. వచ్చి యచ్చిన్నిపాపని నిచ్చినిచ్చ, లిచ్చ మచ్చిక హెచ్చి వియచ్చరేంద్రు
లిచ్చినవరంబు లెఱిఁగించి మచ్చెకంటి, నెచ్చరిక చేసి పవమానుఁ డేఁగుటయును.

శా. నన్నుం బాసి ఫలాశ డాసి యరుణున్ భక్షింపఁగా నిచ్చఁ జే
కొన్నన్ నిన్ను బలారి వజ్రహతిఁ జేఁ గుందించినన్ వ్రాలి నీ
వన్నా! యేమని నన్ దలంచితివొ యంచబ్జాక్షి ప్రేమంబునన్
గన్నీటం గడిగెన్ ధరాగతపరాగక్రాంతపుత్రాస్యమున్. 188

ఉ. ఎక్కడి కెక్కడయ్య దివసేంద్రమయూఖము లాడనుండి యీ
దిక్కునఁ బాఱినంతటనె దేహము దాహము నొందుచుండఁగా
స్రుక్కక చక్కఁగా నెదిరి సూర్యుని చేకొని మ్రింగె నీశఁ ద
మ్మక్క! మహాత్ముఁ డంచుఁ గొనియాడి రతిధ్వనులం దపోధనుల్. 189

క. మిహిరపరిగ్రహము తమో, గ్రహఘోరాగ్రహము దివిజగణశేఖరుని
గ్రహము శివాదిసురాను, గ్రహముఁ దలఁచి కేసరియు సుఖస్థితి నొందెన్. 190

హనుమంతుని శైశవక్రీడాదికము.

సీ. అమితాగమారూఢినాయాయిశాఖల ననుకూలసంచార మాచరించుఁ
బటుశాస్త్రగరిమ చొప్పడి నఖరప్రౌఢి యమరకృత్యాచ్ఛాదనము లడంచు
సవనవర్తనలీల సరి మీఱికుశలతావర్ధనోదారభావము వహించుఁ
గనినయజ్ఞానసంగతి ధర్మవేదిఁ బాయని నేతియుక్తి మాయను హరించుఁ
తే. గానఁబడుఁ గానఁబడ కొక్కకడఁ జరించు, నతులగతులను గురులీల లతిశయించుఁ
... ... ... ... బ్రబలమతి మీఱి వానరబ్రహ్మచారి. 191

క. శిష్టగతి దక్కి మర్కట, చేష్టలు గావింప నేల? శిశులీలల చే
ముష్టింపచులఁ గలఁపకి, కృష్ణుం బని తల్లి సంద్ర తెఱఁగించుటయున్. 192

క. అలపలుకులు మధజలములఁ, బొలుపగు నేమఁగుడు నాలి ప్రోఁగులయట్టుం
బలె నయి క్రమ్మఱ ముసుపటి, నలెఁ ద్రిమ్మర ఘనులు భరితపరితాపమునన్. 193

చ. భువనము లెల్లఁ బ్రోచుటకుఁ బుట్టినయీహరుఁ డిట్టిట్టు లై
శవమునఁ జెంద నేల? యని స్రష్టవరంబున విప్రశాపముల్
ప్రవులమి లోపలం దెలిసి వంవడిఁ జెందఁగఁ దాళలేక భా
ర్గవులు లైనకొండ అనఘవ్రతు లిట్లని రార్యసమ్మతిన్. 194

ఉ. ఇంతటిశౌర్యశాలి కొకయించుక యుద్ధము లేకయున్న నే
చింతలు సేయఁజాలునొ భువిం జలరాశికి వేల గల్గఁగా
నింతియ కాక ముంచుటరుదే జగ? మట్లగుటన్ నిజంబు నే
డింతటివాఁడ నం చెఱుఁగఁ డెప్పుడు నుండెను శాంతుఁడం చనన్. 195

క. అందులకు దెంపమున భయ, మందినగతిఁ బవనజుఁడు బలాహంకృతి బు
ద్ధిం దలఁపక సాత్వికగతిఁ, బొందినచో నదియు నొక్కభూషణ మయ్యెన్. 196

తే. అఖిలలోకోపకారార్థమై మహాత్మ, లెంత తగ్గినఁ దగ్గఁగా దెంచిమాడ
దేవకార్యార్థమై పొట్టిదిట్ట యైన, హరికి నగుఁబాటు వచ్చెనే? యందువలన. 197

క. సాదుతనంబునఁ గనరెపు, గాదిలిసుతుఁ డూది ముస్నుఁ గైకొనినమనసి
ఖేదంబు వాసి ప్రియకా, ర్యపరణాపరణఘణితి నంజన వల్కెన్. 198

## హనుమంతుఁడు తల్లియాజ్ఞచే సుగ్రీవునొద్దఁ జేరుట.

సీ. వినవయ్య సుత! పూర్వమున బ్రహ్మ నిజసృష్టిచాతుర్య మంతయు సంగ్రహించి
కల్పించినయహల్య గౌతమునకు ధర్మపత్నిగా నిచ్చె నప్పుడఁతియందు
బలభేదిభాస్కరులు గలుగఁజేసిరి వాలిసుగ్రీవు లనువారి కూరవరుల
వారిసమ్మతి చూసివలన నేఁ గల్గితిఁ గాన వారలు నీకు మేనమామ
ఆ. లమ్మహాత్ముపుత్రి నై కుంజరుఁడు వేఁడుకొనిన జనకుఁ డొసఁగఁ దనుజ నయితి
నాతఁ డాదరించి మీతండ్రి వేఁడినఁ, బెన్కు వలన నన్నుఁ బెండ్లిఁ జేసె. 199

శా. ఆర్తత్రాణపరాయణుండ పగుసే వస్తుతపోవైభవ
స్ఫూర్తుల్ మించ జనించుటల్ విన ముదంబుం జెందినా వుజ్జ్వల
త్కీర్తిశ్రీనిధి వాసవాత్మజుఁడు సుగ్రీవుండుఁ గిష్కింధపన్
గర్తల్ నీకును మాతులుల్ గనుక సఖ్యం బొందు టర్హం బగున్. 200

క. వారలలో సుగ్రీవుని, చేరువ హితమంత్రి వై వసింపుము పమలోఁ
దా రెడసిన సుగ్రీవునిఁ, గూరిచి యింద్రజునిఁ గూల్పకుము మామ సుమీ. 201
క. అనయము వినయము పెనఁగొన, ననయస్థితి నెనయుఁ మనిన 'జనని హసా'దం
చని మ్రొక్కి భక్తితో నిట్లను హనుమద్బ్రహ్మచారి యంజనతోడన్. 202
శా. తల్లీ! సత్యదయాదిధర్మములు నిత్యబ్రహ్మచర్యత్వముల్
ముల్లోకంబు లెఱుంగ నా కొసఁగినన్ ముక్ ధాతకే భక్తి సం
ధిల్లన్ మ్రొక్కి భజింపఁగాఁ దగినమూర్తిం గాన నెవ్వాఁడో నా
యుల్లంబుం దను వేలుకోఁగలవిభుం డూహించి తెల్పంగదే. 203
ఉ. నావుడు ధాత సీయొడలినవ్యవిభూషణరాజిఁ గాంచువాఁ
డే వివరింప నీకు గతి యిష్టఫలప్రదుఁ డీశుఁడున్ జగ
జ్జీవుఁ డైనవిష్ణుఁ డని చెప్పిన వింటి యథార్థ మైన దో
మీవచనంబునుం గలుగ మేలగు నన్ను లతాంగి యిట్లనున్. 204
ఉ. ఓయి సమీరపుత్ర! కమలోద్భవుఁ డాడినమాట తప్పునే?
నీయొడలం బెడం గగుమణీమయభూషణ రాశి దేవ దై
తేయవియచ్చరప్రతతిదృష్టికి గోచర మౌటఁ గన్నవాఁ
డే యధికారి నీకు నిజమేఁగుము నా ముద మంద మ్రొక్కుచున్. 205
ఉ. ఆననజాక్షియాజ్ఞ తనయాపలఁ దాల్చి యతండు వాలిసు
గ్రీవులచెంత కేఁగి నతికిం దగువారలు గాన మ్రొక్కి సం
భావన సేయ సిర్వురును భానుతనూజునిమంత్రి యై సుఖం
బావహిలంగ నుండె; ఘను లంబయనుజ్ఞ క్రమింపరేకదా! 206
క. ఈరీతి మాతులప్రియ, కారణుఁ డై వేదశాస్త్రకలితాభ్యసన
ప్రారంభసంభృతేచ్ఛా, పారంపరి నున్న నొకప్రభాతమువేళన్. 207
మ. సరసీజాప్తి క్రమించె మిం చెనసె దిక్చక్రంబు చక్రంబు హృ
త్పరితాపంబు దొఱంగె రం గెడలె నక్షత్రాళి తారాశిజా
లరవం బింపు గడించె డెంకెంగి కిష్లోరంబు హారంబుత
ఘ్క రహిం జల్వ టిమించె మించె నరుణాలోకంబు లోకంబులన్. 208
మ. వరపద్మాభ్యుదయప్రసన్నుఁ డగుభాస్వన్మూర్తి మందేహదు
స్తరగర్వంబు లడంచుశూరుఁడు తమస్సంభేదనుం డాప్రభా
కరుఁ డార్యస్తుతుఁ డై జగద్ధితమతిన్ గన్పించు చక్రేశ్వరుం
డరుదేరం గని గంధవాహసుతుఁ డుద్యద్బంధురానందుఁ డై. 209

## హనుమంతుఁడు సూర్యునొద్ద విద్యాభ్యాసము చేయుట.

శా. ప్రత్యూషోచితకృత్యమంతయు సమాప్తంబైనఁ బద్ధిరుం డా
దిత్యుం గాంచి మరుత్సుతుండు జితోద్వేలస్వరాహంక్రియా
ద్ధత్యం బొప్ప వియద్గతిన్ జని రవిన్ దర్శించి ''తుభ్యం నమ
స్సత్యజ్ఞానకళాత్మనే'' యని నమస్కారంబు గావించినన్. 210

క. శంక యొకింతయు నిజరుచి,వంకం గనకున్న మెచ్చి ''వాయుజ! భవత
స్సంకల్పసిద్ధి ర''స్తని,పంకజహితుఁ డతని కపుడు బహుమతి ననియెన్. 211

క. ఓయాంజనాయనోహా,కాయయుతానేకజన్మఘటితతపఃపు
ణ్యాయుతపరిణామోదయ!, యీయెడ కీ వరుగుదెంచు టేమని యడుగన్. 212

శా. ఆసప్తాశ్వున కాతఁ డిట్లనియె నయ్యా! వేదశాస్త్రాగమా
భ్యాసం బెప్పుడు వేఁడ నప్పుడె యొకప్పం బానినా రాట నే
మీసాన్నిధ్యముఁ జెందినాఁడ దయకల్మిం బ్రోవవే యన్న నెం
తే సంతుష్టమనస్కుఁడై రవి తదంతేవాసితో నిట్లనున్. 213

మ. వటుమూర్ధన్య జగద్ధితార్థమతివై స్వర్ణాద్రి చుట్టున్ సము
త్కటవేగంబునఁ ద్రిమ్మరన్ వలసె శాస్త్రగ్రంథముల్ మార్గలం
పటసంపర్కమునం బఠింపఁ గఠినప్రాయంబులై తోఁచు నె
ప్పటిలీలన్ భ్రమ మొంద కిట్లు చరియింపన్ జాలుదే నావుడున్. 214

ఉ. పావని పల్కె నోభువనపావన! నావడి నేనె పేర్కొనం
బోవుట నెంతగర్వి యని బుద్ధిఁ దలంపకు పూర్వపశ్చిమ
గ్రావయుగంబునం బదయుగం బిడి వెంబడిఁ జెంది యుందునో
దేవరకంటె ముందు నడతెంతునొ యానతి యియ్యవే యనన్. 215

ఉ. పేరుగఁజాలజోదు వచియించె నొహో మహిమాఢ్య! నీవు నే
వేఁడు జగంబులందుఁ గలదే? యవిలంఘ్యము రెండుకొండలం
గూడఁ బదంబు లుంచి కనుఁగొన్న నియచ్చరు లిచ్చ మెచ్చఁగా
వేడుకయుం బ్రతిష్ఠ యొదవింపుము నా కని పల్కరించినన్. 216

మ. జలజాతాప్తునకుం బ్రదక్షిణనమస్కారాలు గావించి ముక్
బరి నర్థించి త్రివిక్రమస్ఫురణఁ జూపంబూనువిష్ణుండునుం
బలెఁ దారల్ మొలనూలుముత్యములరూపం బూన నానాదిశా
వలయవ్యాపకుఁడై కపీంద్రుఁ డలరెన్ స్వైరప్రచారోద్ధతిన్. 217

మ. హనుమద్దేవునిదివ్యవిగ్రహము బ్రహ్మాండంబునన్నిండినం
తనె తద్వ్యాప్తిఁ బటీలునం బగిలి కానన్ వచ్చుఛిద్రంబొకో
యని తత్కర్పరమధ్యరేఖ గని భాషాధీశుఁ డుద్భ్రాంతుఁ డై
మొనయం జేయఁగ నేఁగుదెంచి తిరిగెన్ మున్నున్న తీరెన్నుచున్. 218

సీ. సంధ్యాభ్రతారకాసముపయాభ్యుదయంబువలె నురంబున హారములు వెలుఁగఁ
బూర్వాస్తశిఖరాగ్రముల మించుసూర్యచంద్రులపండిఁ గుండలద్యుతి చెలంగఁ
గమలగర్భాండోర్ధ్వకర్పరచ్ఛత్రకాండములీల వాల మున్నతి వహింప
ముప్పేటముంజితో మొనయుమేఖలరేఖ ధరియించి వలయభూధరము వెలయ

తే. జవనిరూఢి విరాట్ప్రౌఢి నవఘళించు
కపి విరాడ్వృత్తి సర్వదిక్పాలితుఁ డైన
మునులు దివిజులు "హరయే! నమో నమోస్తు
తే"యని నుతింపనతఁ డుగ్రతేజుఁ డగుచు. 219

స్రగ్ధర. తనకాలోద్వేగలీలాతరణవిభవమున్ వర్ణనీయంబు గావిం
చెనో నా వాణీశసంయోజితసకలజనశ్రేణికర్మాశ్రయాయు
ర్హానసార్థార్కప్రయాణోద్యమపటుచతప్రాగ్వ్యాస్తశైలంబులందున్
హనుమంతుం డుంచె భక్తాయతహృదయసరోజాస్పదంబుల్ పదంబుల్. 220

వ. తత్సమయంబున. 221

శా. ధ్యానం దద్భుతచిత్తుఁ డై పలికె నో ప్రత్యక్షరుద్రావతా
రా! నన్నుం జను లాదరించుటకుఁ బేర్మి న్వచ్చినా వింతె కా
కేనా నీ కుపదేష్ట నిన్ను మును నే నేమంటినో బుద్ధిలో
నా నేరంబు క్షమింపు మన్న వినతుం డై వాయుజుం డిట్లనున్. 222

ఉ. ఇట్టుల నానతియ్యఁ దగవే జగదీశ్వర! వేదరాశికిం
బట్టగు పెన్నిధానమవు పట్టి నుతింపఁగ నేల? నన్నుఁ జే
పట్టి త్రయీప్రపంచముఁ గృపన్ వివరింపు మటంచు దిట్టయై
యట్టె నిజాకృతిం బొలిచె నాతని తేరికి సమ్ముఖంబుగన్. 2 3

క. పదరక యొకగడియకుఁ దొమ్మిదిలక్షలయోజనములమీఁదన్ మఱిదె
బ్బదివేలుఁ దిరుగురవికట్టెదుర నతనికంటె వడిఁ గపీంద్రుఁ డరుగుచున్. 224

సీ. పాడిపదక్రమప్రౌఢి నేర్చియుఁ దొల్తఁ బాడిపదక్రమప్రౌఢి నేర్చెఁ
బ్రాభాకరోన్ముఖభావస్థుఁ డయ్యును బ్రాభాకరోన్ముఖభావ మొంది
నియతిఁ బ్రత్యాహారనిపుణుఁ డయ్యును శబ్దనియతిఁ బ్రత్యాహారనిపుణుఁ డయ్యె

స్మృతిపురాణార్థసంగతు లెఱింగియు బాహ్యస్మృతిపురాణార్థసంగతు లెఱింగ
తే. నిరతసంగీతరతగతోద్ధురతం గనియు, నిరతసంగీతరతగతోద్ధురతం గనియె
విమలవిద్యాధికుం డయ్యె విద్య లెల్లఁ, జదివె సామీరి లోకైకసంగ్రహేచ్ఛ. 225

ఉ. చండకరోక్తశాస్త్రవిలసచ్ఛ్రవణత్తమ భావిపద్మగ
ర్భాండవిభూత్తమాంగచలనాన్వితకర్ణసువర్ణవర్ణమ
త్కుండలకాంతిపఙ్క్తికలు కొల్లలుగా దిశ లెల్ల నిండ బ్ర
హ్మాండకరండ మంతయును హాటకదీప్తి వహించె నెంతయున్. 226

తే. ఇవ్విధంబున రవిచెంత నింత నంత, ముందుగా నేగుచుం దధాభిముఖ్యమునను
సర్వశాస్త్రము లెఱిఁగి ప్రాంజలి లలాటసీమఁ గదియించి వానరశ్రేష్ఠుఁ డనియె.

శా. "విద్యోతత్కరుణారసేన భవతో విజ్ఞాతమద్యాఖిలా
సద్విద్యాఽపేహి న దాతు మీశ మితి మాం స్వామిన్! గురోర్దక్షిణాం
హృద్యాం స్వీకురు పాదపద్మనతిం ప్రేమ్ణా కృతాం తే", యటం
చాద్యోరత్నము నంత వీడ్కొని జగత్ప్రాణాత్మజుం డింపునన్. 228

ఉ. గ్రంథము లెల్ల నెఱింగి బుధగణ్యుఁడు మాతులదర్శనేచ్ఛఁ గి
ష్కింధకు వచ్చి యచ్చటివిశేషము లన్నియు నింద్రపద్మినీ
బంధుజసన్నిధిం దెలిపి భాస్కరసూతి జగత్త్రయైకపా
ణింధమమూర్తియైనతను నెయ్యమొసర్పఁగ నుండె నయ్యెడన్. 229

క. శ్వసనప్రియసూతి రవిగ్రసనవ్యసనాఢ్యుఁ డౌట ఘనతరవిద్యా
భ్యసనార్థి యగుట నొకపరి, రసనాగ్రముఁ జేర్చి నిహపరంబులు గలుగన్. 230

క. అని రాముఁడు వినిపించిన, విని జనకజ యవల నెట్టివిధమున మెలఁగెన్
హనుమ వివరింపఁ గదవే, యని యడిగిన నుడువఁ దొడఁగె నని తెలుపుటయున్.

## ఆశ్వాసాంతము.

ఉ. బద్ధనదీశ! దీనజనపక్షవిలోకన! లోకనార్థితా
త్త్రోద్ధవసంగ! సంగరభరోర్జితదేవన! దేవనవ్యకా
ర్యోద్ధృతిభూమ! భూమహితయోనిజపావన! పావనత్వసం
సిద్ధవిచార! చారణరుచిశ్రితనీరజ! నీరజస్పృహా! 232

క. దశనాదాభ్యసనావృతి! దశనానామ్నాయకేళి! భరసీరలస
ద్దశనాతిశుభద్యుతి! మరు, దశనాధిపశేముషీ! రమాతతవిహృతీ! 233

భుజంగప్రయాతము.—

బుధాంతస్సమాధిప్రపూర్ణైకకేళీ!, విధానందినాకాశవిఖ్యాతహేళీ!

విధూత్తంసహృత్పద్మవిభ్రాజితాళీ!, యధిష్ఠానచైతన్యహారిత్వశాలీ! 234

గద్య. ఇది శ్రీమదంజనాతనయదయాకరసలసత్కటాక్షవీక్షామహత్త్వసంప్రాప్తకవిత్వ విద్యావధాన సగుణనిర్గుణధ్యానవాసనాభిధానమానసబిసపుష్ప పుష్పగిర్యప్పనార్యకుమార సమాశ్రితబుధాచార గురుజనవిధేయ తిమ్మననామధేయప్రణీతంబైన సమీరకుమారవిజయంబను మహాప్రబంధంబునందు అంజనాపూర్వజన్మవృత్తాంతంబును, కుంజరతపశ్చరణంబును, అంజనాప్రాప్తియు, తద్వివాహంబును, అంజనావ్రతచర్యయు, వాయుమాహాత్మ్యంబును, ఋతువర్ణనంబును, ఆంజనేయావతారంబును, సూర్యగ్రహణంబును, దేవతావరప్రాప్తియు, కిష్కింధాగమనంబును, సూర్యునివలన వేదశాస్త్రంబు లభ్యసించుటయునున్నది ద్వితీయాశ్వాసము.



# తృతీయాశ్వాసము.



కాంతోజ్జ్వలకస్తూ
రీకాశ్మీరాదిసరసరేఖావృతభృం
గాకారస్ఫురదలకధ
రాకన్యాఘాలఘులక! రఘుకులతిలకా! 1

తే. అవధరింపుము భూతదయాగరిష్ఠుఁ
డగువసిష్ఠునిఁ గని గౌతమాత్మజాతుఁ
డవలికథ యేమి వివరింపుఁ డనిన స్వామి
తెలిపిన క్రమంబు విను మని తెలుపఁదొడఁగె. 2

## రామసుగ్రీవమైత్ర్యాచరణాదివృత్తాంతము.

ఉ. వాలి ప్రతాపకేళిఁ గడువాలి కరాళితసాన సానలో
మాలి విరాళి హేళిసుకుమారుని మోహపుటాలి నైంద్రసే
లాలి మదాలివేణి జవరాలి గ్రహింప నశక్తుపోలికం
దాళి మరుత్సుతుం డతని దండన సేయక తల్లియాజ్ఞ చేన్. 3

సీ. అగ్రజాగ్రహసముగ్రావమానపయోధి మరుదాత్మభవధైర్యతరిఁ దరించి
కాంతావియోగసంక్రాంతచింతావహ్ని హరివటూక్తిసుధాలహరి హరించి
ఘనరాజ్యరాహిత్యగతదుఃఖతిమిరంబు తరణిశిష్యునిమిత్రతను గలంచి
నిజపరాజయమనోంబుజరుజాగజరాజిఁ గేసరిశిశుసంగకేళి నోడిచి

తే. తనరెఁ గాక హనూమత్ప్రధానుఁ డఖిల, కార్యధౌరేయుఁడై మీఱఁగా రవిజుఁడు
లేనిచోఁ జానమాని బలాఢ్యుఁడైన వాని, ప్రాణమూని మనోగ్లాని బ్రతుకఁగలఁడె? 4

శా. కార్యాకార్యవిధిం బ్రధానుఁ డయి శోకధ్వంసనాయుక్తి నా
చార్యుండై బహుచింతితార్థఘటనాసంపత్తిచే దేవుఁడై
స్థైర్యోత్పాదనశక్తిదాత యయి నిత్యంబున్ మరుత్సూతి త
త్సూర్యప్రోద్భవుఁ బ్రోచె; ఘనజనసంతోషప్రదుల్ గా బుధుల్. 5

తే. తనకు గురుఁడైనద్వాదశాత్మకుకుమారుఁ, డనుచు మైత్రిని బహుమైత్రి నలరఁజేసె
నాంజనేయుండు ధర్మాత్ము లైనవారి, కాత్మగురుబంధురక్ష న్యాయంబ కాదె! 6

ఉ. ఉగ్రమతంగశాపకలనోక్తుల వాలికి ఋశ్యమూకశై
లాగ్రముఁ జేరరామిఁ గుహనాకృతిధారుల నుగ్రభానుభూ
నిగ్రహబుద్ధిఁ బంపఁ దన నెమ్మది సర్వ మెఱింగి వీరలో
కాగ్రణి వాయుసూతి తెగటార్చె ననేకుల దుర్వివేకులన్. 7

ఉ. ప్రాజ్ఞుఁడు శక్తుఁ డుత్తముఁడు పావనమూర్తి మరుత్సుతుండు స
ర్వజ్ఞుఁడు గానిచోఁ దపసివాలకముల్ విలునమ్ములున్నవం
చజ్ఞత నమ్మకున్న పవనాత్మజు నమ్మఁగఁ బల్కె మున్ను మా
ప్రజ్ఞ లెఱింగి సత్యమృదుభాషల సంధి ఘటింప నేర్చునే. 8

సీ. విద్వజ్జనంబులో విద్వచ్ఛిరోమణి కవులలో నుత్తమకవివరుండు
గాయక శ్రేణిలో గాయకశ్రేష్ఠుండు బలియురలో మహాబలసమగ్రుఁ
డలతపోనిధులలో నతులతపశ్శాలి బహుయోగిపటలిలోఁ బరమయోగి
ధీమద్గణంబులో ధీమత్కులస్వామి గుణులలో లోకైకగుణధురీణుఁ

తే. డఖిలవైరాగ్యపరులలో నతివిరక్తుఁ, డధికవీరులలోన వీరాగ్రవీరుఁ
డప్రమేయుఁడజేయుఁడీయాంజనేయుఁ, డితనితులయింపఁగలఁడె? భోగీంద్రుఁడైన. 9

సీ. ఘనవిరక్తుం డైన గానవిద్యారాశి విజితేంద్రియుం డైన వీరవరుఁడు
పటుశాంతుఁడగురిపుప్రళయకాలహరుండు విద్యాధికుం డైన వినయపరుఁడు
సతమనస్థాయి యైన మరున్మనోవేగి బహుకార్యవిదుఁడైన బ్రహ్మచారి
సౌశీల్యనిధియైన శాఖామృగస్వామి యతిబలైశ్వర్యాఢ్యుఁడగు నిగర్వి

తే. యఖిలలోకజ్ఞుఁ డాత్మశక్త్యజ్ఞుఁ డమిత, కామరూపధరుం డైనఁ గామదూరుఁ
డనఁగ మీఱుననంతకల్యాణగుణవి,హారగుణసంగతులు త్రిలోకాద్భుతములు. 10

క. లోకంబుల గలవేలుపు, లేకైకగుణప్రసక్తి నెంతయు ఘనతల్
చేకొనిరిట తత్సకలగు,ణాకరుఁ డనిలజుఁడు కీర్తులందుట యరుదే? 11

తే. సకలదైవప్రభావముల్ సద్గుణములు, పరమసుజ్ఞానవైరాగ్యభక్తికరుణ
లతులకాంతిప్రతాపంబు లైక్య మొంది, పవననందనరూపమై పరిణమించె. 12

సీ. సత్కర్మగతిఁజూపె సద్బ్రహ్మచారియై పూర్వాశ్రమాచారభూతిఁ జెంది
భక్తి గన్పించె మద్భక్తాగ్రగణ్యుఁడై స్వాతంత్ర్యలీలావశత్వ మొంది
జ్ఞానంబుఁ బ్రకటించె జ్ఞానప్రభాసియై ప్రారబ్ధమాత్రానుభవత కొదవి
విరతిభావముఁ దెల్పె విరతిసంపన్నుఁడై జన్మప్రభృతి నన్యసంగ ముడిగి

తే. స్వామిభృత్యనయోద్యోగసౌమ్యవినయ, ధర్మదాక్షిణ్యకార్యసంధానధైర్య
శౌర్యచాతుర్యముల నాత్మసరణిఁ దెలిపె, నఖిలలోకోపకారి యక్షాసురారి. 13

క. కాంతారహితుని నిజకుల,కాంతారహితుని నితాంతకాంతస్నేహా
భ్యంతరులఁ జేసె శ్రీహను,మంతునిఁ జింతింప శక్యమా యని పలుకన్. 14

క. భామిని శ్రీరఘునాథ,స్వామినిఁ దిలకించి మైత్రిసమ్మతి నిమ్మున్
సామీరి మైత్రిసలుపుట, యామీఁదటికథలుఁ దెలుపుఁడని వేఁడుటయున్. 15

శా. జంభారాతి శుభప్రదానకలనా సంభూతసంభావనా
హంభావక్రమణా త్రివిక్రమపదాబ్జాంగుష్ఠవేగావధూ
తాంభోజాతభవాండభాండ బహిరుద్యత్తీరరాశిస్రవ
ద్గంభీరాంబు ఘుళం ఘుళార్భటులు లెసంగన్ రాఘవుం డిట్లనున్. 16

క. చెవులకుఁ జవులగు హనుమ,త్కవిచంద్రుని పుణ్యకథలు కడు వేడుకతో
సవిశేషములుగ నీ కిఁక, వివరించెద నెఱిఁగినంత విను మవి యెల్లన్. 17

చ. రమణిరొ! పూర్వచంద్రకళ రాహువు మ్రింగినచో జగంబునం
దమము సమగ్రమౌనటులు దైత్యుఁడు నిన్ గొనిపోవ నామనం
బమితవియోగబంధురమహాంధతమిస్రనిమగ్న మైనచో
నిమిషము నొక్కచో నిలువనిల్కడ గానక కానలోపలన్. 18

సీ. నిండుపున్నమ రేలఁ బండువెన్నెలవేఁడికార్చిచ్చువెచ్చలఁ గ్రాఁగి క్రాఁగి
చిలుకతేజీరౌతుచెఱకుసింగిణివింటినారిమ్రోఁతలఁ దాల్మి తాఱితాఱి
యలరుపుప్పొడికుమ్ము కెలనఁ జల్లుచుఁ గ్రమ్ముచలువతెమ్మెరదొమ్మి సొలసి సొలసి
చెవులకు ములుకులౌ చిగురుమేపరిపుల్గు జిల్గుపాటలసూటి చెదరి చెదరి
తే. నెగడునిట్టూర్పునెగలచే నొగిలి నొగిలి, యిరవు దొరయనివిరహాబ్ధి నీఁది యీఁది
కడప దరి గన్నగతిఁ గనిపింపఁ బాప,దరిగని వసించి యున్నఁ దత్సమయమునను.

సీ. రాకేందుకరనిభబ్రహ్మసూత్రంబుతో మెలిగొన్నమౌక్తికావళులవాఁడు
పసిఁడికెంజిగిపట్టుపంచెపై సరిగంచు మొనయుముప్పేటక్రొమ్ముంజివాఁడు
నవరత్నఖచితకుండలశుభప్రభలతోఁ దళుకెక్కుచెక్కుటద్దములవాఁడు
బాలార్కశోణాస్యలీలతో సరిపోల్పఁదగు కేలిమేలికెందమ్మివాఁడు
తే. పసిమిగోఁచియు ముంగేల మిసిమికంకణంబు ధరియించి నిజదేహనవ్యకాంతి
బయలు బంగారు గావించు బ్రహ్మచారి, యొకఁడు మాచెంత! కరుదెంచుచున్నఁ జూచి.

ఉ. సోదరు నంటి యంటి సుగుణోత్తమ! కంటివె యల్ల కొండపైఁ
భావము లూఁది డిగ్గి మదబంధురసింధురలీల నొయ్యనే

యీదెస సుప్రసన్నశుభదృష్టిని జూచుచు వచ్చుచున్నవాఁ
డాదరణీయుఁ డీవటుకులాగ్రణిఁ జూడఁగ వేడు కయ్యెడున్. 21

ఉ. బంగరుపట్టుగోఁచి మనుపచ్చనిముంజియుఁ నొంటిజందెమున్
ముంగయికంకణంబు జిగిమోహనహారము కుండలప్రభా
భంగకపోలముల్ తరుణభానుసమానముఖాంబుజంబు మీ
జంగ వటుక్రియన్ శివుఁడు రాఁడుగదా మనచింత దీర్పఁగన్. 22

తే. శివుఁడె కావలెఁ గాకున్నఁ జన్నివటుక, పాపనివితాన మనలోనితాప మార్ప
మను మని యకృత్యము సహింప మనవి దెల్ప, వచ్చువాణీశ్వరుండుగావలయునితఁడు.

ఉ. ఉత్తివధూసతీశ్వరుల నొక్కఁడు గా కిటఁ డున్న నీశుభ
వ్యక్తియు నీవిరక్తి విభవాద్యనురక్తియు నీమహత్కళా
వ్యక్తముఖాబ్జయుక్తి కలదా? యితనిం గని మాటలాడఁగాఁ
బ్రాక్తనజన్మపుణ్యపరిపాకవశంబునఁ గాక కల్గునే? 24

ఉ. మచ్చిక కెక్కునిక్కపుకుమారునిచారుశరీరకాంతిచే
నిచ్చటిచెట్టు లన్నియును హేమపువన్నియఁ జెన్నుమీఱెనే
నెచ్చటఁ గాన నిట్టిఘను నీతనిఁ జూచినయంత నిచ్చలో
హెచ్చె ముదంబు విచ్చె వెత లేమి విశేషము గల్గ నున్నదో! 25

వ. అని పల్కుసమయంబున. 26

ఉ. ఇంగిత మాత్మలో నెఱిఁగి యే నను వాక్యము లాలకించి మ
మ్ముం గడియంగ వచ్చి కయిమోడ్పు లలాటమునం దమర్చి సా
ష్టాంగ మొనర్చి మచ్చరిత మంతయు లక్ష్మణుచే నెఱింగి మా
యంగద వాయు రంగదమృతాక్షరసంగ మెసంగ ని ట్లనున్. 27

క. రావించెద సుగ్రీవునిఁ, గావించెద మీకు బంటుగా ననిశంబున్
సేవించెద మీపదములె, భావించెద మిమ్ము స్వామిభావమున నృపా. 28

ఉ. కేసరి కంజనారమణికిం బవమానవరప్రసన్నతం
జేసి జనించినాఁడ నృపశేఖర! నన్ హనుమంతుఁ డండ్రు ప
ద్మాసనుఁ జేరి నాకు గతి యాపతిఁ దెల్పు మటన్న నిమ్మెయిన్
భాసిలుభూషలం గనినభవ్యుఁడె పొ మ్మనియెన్ ధ్రువంబుగన్. 29

ఉ. ఆచతురాస్యుఁ డాడినటు లాత్మవిభూషణపాళి నాకు దృ
గ్గోచరమయ్యె హా! మతిలఘుస్థితిఁ బల్కితి సర్వలోకలో

కాచరితక్రియల్ తెలియునంతటిమీ కొకక్రొత్తి ముందియుం
గోఁచియుఁ గంకణంబు గనుఁగొంట విచిత్రమె లోకనాయకా! 30

ఉ. సృష్టిసమష్టిభావములయందు చిరంతరసాక్షివై సదా
సృష్టివివర్ధనప్రళయశీతలమాయ నిజృంభణక్రియం
జేష్ట లొనర్పఁ గర్తవెనుపించియు మూర్తివి నీవు నేఁడు నా
దృష్టికి గోచరించుట యదృష్టము గాదె! విశిష్టవైభవా! 31

సీ. హృదయాంధకారంబు లెడలె మీముఖచంద్రు దర్శించుమాత్ర సీతాకళత్ర!
బహుపాతకశ్రేణి వాసె నీనామంబు వాకునఁ బలుక నిక్ష్వాకుతిలక!
పరమపావన మయ్యె భవదంఘ్రియుగళంబు కెలనమే నొలయ సాకేతనిలయ!
కామితార్థము లెల్ల ఘటియిల్లె మిముఁ గూర్చి కమనీయగతి డాయఁ గౌసలేయ!
తే. మొగిసె భవపంకజాలము మోదమ్ముఁ గేలు, మీ కొసంగినయంత లోకైకకాంత!
నెగడె నిత్యోత్సవశ్రీలు నిన్నుఁ గొల్చి, ధన్య వాయని ప్రేమఁ గోదండరామ! 32

ఆ. అనుచు పమ్మఁగనుచు నవుచు మనంబున,మురుచు మనుచు వేఁడుకొనుచు నున్న
యతనిభక్తియుక్తి కత్యురక్తికి, నాత్మ కంపమింప ననుజుఁ జూచి. 33

ఉ. ఈకపికుంజరుండు వచియించినమాటలు వింటివే? నవ
వ్యాకరణార్థదీపకము లంచితశబ్దనిగుంభనక్రియా
స్తోకము లన్యథా శ్రుతవిశుద్ధపదాన్వయము ల్మనశ్శ్రవ
శ్లోకహరంబు లట్టిగుణసుందరు నెందులనైనఁ గంటిమే? 34

సీ. అమృతంబురుచి మోవి యర్ధగంభీరసంపద నాభిసరసి కోమలత మేను
తిన్నదనంబుపొందిక మందగమనంబు చాతుర్యములు విలాసక్రమంబు
నుతిసంగతిత్రపాగతి నవోఢారూఢి యరుదైనయపశబ్ద మసదుఁగొను
కనిపించుతేట చక్కనిముద్దులేనవ్వు కనదనర్ఘశ్రితశృంగారస్ఫురము
తే. రక్తపదపల్లవచ్ఛాయ రమ్యరీతి, సరసభావంబు నవలీలజవ్వనంబు
గాఁ జెలంగుమహనీయమన్మథప్రసక్త,వాణి వలపింపదే యెంతవారి నైన? 35

చ. అని కొనియాడుచున్నసమయంబున వాయుజుఁ జేఁగి భానుజుం
గని ఘనశోకవార్ధి కడగాననినీకుఁ గపీంద్ర! రాఘవుం
డనుపరిదాపు గల్గె నిఁక నాపదలన్నియుఁ దీఱె వేగ ర
మ్మని యిట వచ్చి మీభటున కర్కికి దర్శన మియ్యరే యనన్. 36

క. ప్రేమలు నరవానరులకు, నేమించి సఖిత్వ మొసఁగునేర్పున నారా!
యీమహి నఘటనఘటనా,సామర్థ్యము నీకె కలదు సామీరి హరీ! 37

శా. ఈనిర్వ్యాజపరోపకారవిభవం బీనిత్యసత్యవ్రతం
బేనైపుణ్య మనన్యదృష్ట మని నే నెంచంగ లజ్జించుచున్
దా నెంతేఁ దగుభక్తిఁ దోడుకొని చెంతన్ ఋశ్యమూకాద్రిపై
భానుప్రోద్భవుఁ గానిపించె నితఁ డాపద్బంధు సామాన్యుఁడే? 38

శా. బంధుస్నేహధురీణుఁ డైనరవిజుం బాటించి వాలిన్ సురా
బంధుశ్రేష్ఠమదాపహారబలసంపచ్ఛ్రీని దూలించి కి
ష్కింధాపట్టణపట్టబంధురునిఁగాఁ జేయింప నేఁ గంటిఁ బ
త్సంధానోచితవాగ్విధాననిధియా సామీరి చేకూడుటన్. 39

చ. వినుఁ సుషేణముఖ్యకపివీరుల నిన్ వెదకన్ దినేంద్రనం
దనుఁ డొకకొంపఱుం బనిచి దక్షిణభూమికి నంగదాదులన్
బనుపఁగ వారిలోఁ గలసి పావనియున్ జతగూడి పోవఁగా
ననిలజ! యిందు రమ్మని ప్రియంబున దగ్గఱఁ బిల్చి పల్కె నినన్. 40

ఉ. నావిధ మంతయున్ జనకనందనతోఁ వివరించి తొల్తఁ బ
జ్జవన ముద్ధరించి మఱి సీతశుభస్థితి నాకుఁ జెప్పుమ
జ్జీవవిధాయివై మరలఁ జేయుము తండ్రి! వివాహకార్యశ్రీ
లావిధి సీతయున్ రఘుకులంబు పునర్జననంబుఁ జెందఁగన్. 41

ఉ. అని మణిముద్రికామణి ప్రియత్వ మెసంగ నొసంగ భక్తిఁ గై
కొని శిరసావహించి కనుఁగోనల నుంచి ప్రసాదమయ్యా! నేఁ
జని త్రిజగంబులన్ వెదకి జానకిఁ గన్గొని కాని యూరకే
నినుఁ బొడఁగానరా నిదియె నిక్కము స్వామి! యటంచు మ్రొక్కుచున్. 42

చ. బహుమతి మమ్ము పీడుకొని భానుజలక్ష్మణసంయమానుఁడై
సహచరవానరప్రవరసంఘముతోఁ జని పర్వతంబులన్
గహనములన్ మహానదుల గ్రామములన్ ఘనపట్టణంబులన్
బహునగరంబులన్ వెదకి భామిని నిన్ గనలేకపోవఁగన్. 43

స్రగ్ధర. రాణించెన్ వ్యాళరాజవ్రజరుచిరఫణారంగరంగన్మణిశ్రీ
శోణాభాయుక్తరంగచ్ఛ్రుతకరకలనాసూచితానేకనాక
స్త్రైణస్తోకస్తనాగ్రస్థలఘుసృణఘృణీసంగగాంగప్రవాహ
శ్రేణీసంశ్లేషలీలాంచితతతగరిమన్ సింధురా జంతఁ జెంతన్. 44

క. ఆకడలినీటి దాఁటఁగ, లే కడలి కపీంద్రు లలవు లెక్కించుకొనన్
జో కడలి జాంబవంతుం, డాకడ లిడఁ జూపకున్న యనిలజుఁ బల్కెన్. 45

సీ. ఘనసత్వసత్వరక్రమసిరూఢిఁ జెలంగి కవిసక్తజీవనఖ్యాతిఁ బొంగి
యవనిభృద్వరకుమారాశ్రయత్వముఁ గాంచి లలితప్రవాళలీలలు ధరించి
బహువాహినీసంగతిప్రాభవస్థితి మించి పరమగంభీరసంపద వహించి
బాడబస్ఫురణ రూపమునందు వెలయించి పుణ్యజనప్రాప్తిపొలుపు తెంచి
తే. యనిలతనయ! సముద్రుండ వైనఁ గాక
దుస్తరుండ వంచునో మ్రోయఁదొణఁగినాఁడు
ప్రతిఘటించుసముద్రుండు భంగమొంద
నిస్తరించి భవత్కీర్తి విస్తరింపు. 46
మ. అన నుప్పొంగి మరుత్సుతుండు కపులారా! దుస్తరంబైన తో
యనిధిం దాఁటెద లంక మీఁటెదఁ దృణప్రాయంబుగా జానకిం
గని వే వచ్చెదఁ గానకున్న జలధుల్ గాలింతు భూలోక మె
ల్లను దూలింతు నుడుప్రకాండ మిల వ్రాలన్ వంతు నాకాశమున్. 47
వ. అని పలికి. 48
శా. బాహాస్ఫాలన మాచరించి నిజరూపం బుద్ధతిం బెంచి కా
లాహీశానవిశాలవాలలత మున్నాగ్రంబు హత్తించి తే
జోహంకారత మించి వార్ధిపయిఁ జూపానించి తార్క్ష్యానిలో
త్సాహశ్రీల రమించి రాము మదిలో ధ్యానించి హృష్టాత్ముఁ డై. 49
లయగ్రాహి.—
అక్కడిసమీపగిరి యెక్కి శిఖరాగ్రధరఁ
ద్రొక్కి పదునగ్రశిలచక్కి కరముల్ రెం
డక్కరణి నూఁదికొని చక్కఁగ సురారిపురి
దిక్కు స్థిరదృష్టిఁ గని మిక్కుటపువేడ్కన్
ఢక్కమనభీతి యిఁకఁ జిక్కె దశకంధరుఁడు
స్రుక్కె దనుజాన్వయము నిక్కమని వేల్పుల్
దిక్కులఁ బ్రసూనముల ప్రక్కులొలయింప వడి
నెక్కొనఁగఁ బావని చివుక్కున దాఁటెన్
మ. లవణద్వీపవతీశ్వరోత్తరణవేళాలోలవాలోల్లల
త్పవనప్రోద్ధతి భూపరాగము జగత్ప్రాణాత్మజుం గూడి పో
వ విలోకింపఁగ నొప్పెఁ గూఁతుఁ గనఁగా వాంఛించి భూదేవి వా
యువుపుత్త్రుం డటు పోవ వెంటఁ జన నుద్యోగించెనో! నా దివిన్. 51

మ. హృతబాలార్కుఁడు మెట్టఁగ్రుంగి యెగయన్ హీనస్థితిం జేలి ప
ర్వతముల్ దూలముకన్నఁ జుల్కఁదనమున్ బ్రాపించి భగ్నంబులై
క్షితిపై వ్రాలె ధృతిం ధరించి సెలవుం గేడించి పైనొందుని
ర్గతు లెందుం బడిపోవ కాత్మగతధైర్యం బూనఁగా నేర్తురే? 52

ఉ. మాయవనిఁ జూడఁ జనుమారుతికిన్ ఫలకోటిఁ దృప్తిగాఁ
జేయుద మీ ప్రయాణమున జేరువనే చని యంచు వెంబడిన్
బోయి దశాస్యునిం దలఁచి పోవ భయంపడి జాఱెనో యనన్
వాయుజుమైవెసన్ బెకరి వాయువుగతిన్ జని కూలె సాలముల్. 53

మ. హనుమద్వీరువిసింహగర్జనలచే నచ్చోటికొండల్ ప్రతి
ధ్వను లిచ్చెన్ సురలార! మీకు భయముల్ వల్దింక నిశ్శంక భూ
తనయం జూడ దశాస్యగర్వ మడఁపన్ ధానేఁగుచున్నాఁడు పా
వని యం చున్నతిఁ జాటుచున్నవో! యనన్ వాగప్రమేయోద్ధతిన్. 54

ఉ. ఆలవణాబ్ధినీరు పవనాత్మజుమైవడిఁ బాయ సప్తపా
తాళములుం గనంబడియెఁ దద్దశకంఠుఁడు నాగబాలికా
జాలముతో స్వరత్నములు సర్వము గొంటు రవస్థలంబునన్
బోలఁగఁ దెల్పు లోఁ గలుగుపోడిమి వారిధి చూపెనో యనన్. 55

మ. అఖిలాశ్చర్యకరప్రభావుఁ డతఁ డత్యాసక్తి లంకాపురో
న్ముఖుఁడై పోవ జగద్ధితార్థ మితఁ డెంతో దూర మిట్లేఁగెడున్
సుఖయానంబు వహింపఁ జేయఁదగునంచున్ వార్ధి మైనాకుఁ డన్
శిఖరిం బంచిన నాతఁ డడ్డముగ రాఁ జింతించి చిత్తంబునన్. 56

శా. అక్షీణోద్ధతి రామకార్యఘటనాహంకారియై పోవఁగా
రక్షోమాయఁ బ్రయాణవిఘ్నమునకై రాఁబోలు నీనిన్ ధృతిన్
శిక్షింపం దగు నంచుఁ గాంచనగిరిశ్రీ మించుమైమించుతో
నాక్షేపించి మరుత్కుమారుఁడు శిఖర్యభ్యుత్థు దాఁకెన్ వెసన్. 57

ఉ. మించులమించుపైటవడు మేటిగుణాలవజీరుచేతి నా
అంచులకత్తిపై ట్టెయుఁగనట్టి మహాగిరిపట్టి యంతకున్
మించిన గాడ్పుచూలి బలుమే నొరయన్ ధృతి దూలి యంపలోఁ
నించుక జేటి క్రమ్మఱఁ గపీంద్రునిఁ జూచి మనుష్యుఁడై యనున్. 58

మ. కపిలోకేశ్వర! సర్వలోకహితసత్కార్యార్థివై పోవునీ
కఫకారం బొనరింప రా నుదధి నీయాత్రాశ్రమం బార్ప న

స్నిపు డంపెన్ బహుకంటకమూలములచేఁ బృథ్వంబదై మార్గసం
గపరిక్రాంతి దొఱంగి పొమ్మనుచుఁ బల్కన్ వాయుజుం డిట్లనున్. 59

క. ఆకడ గని వచ్చెదనే, నాకుం దగ నేల! విడియ నడిసంద్రములో
నాకుం దగవే యని మైనాకుం దగ నిల్పి పవననందనుఁ డవలన్. 60

మ. స్వరథేశుల్ స్వపరాక్రమక్రమపరీక్షాబుద్ధిమైఁ బంప నం
బరవీథిం జనకంటె సింహిక మహారూపం బనాఁగాఁ బూనఁగా
సురసాగర్భము సూక్ష్మరూపమున నచ్చోఁ జొచ్చి వెల్వచ్చితే
సరిపుత్రుం డనుపదంబు నెల్లఁ గైకొనె నంజనాబాలభానుప్రభన్. 61

క. ఆగ్రహమున నాగ్రహవిగ్రహ మొనరించి తోయనిధి దాఁటె సువే
లాగ్రావాగ్ర్యాగ్రముఁ బగ్రహవాయూథి నెక్కి యశిలజుఁ డలరన్. 62

శా. ప్రత్యూహప్రచయం బడంచి ప్రకృతిప్రాభవ్య మోడించి సం
సృత్యంభోధిఁ దరించి గట్టు గని వాసిం జెందు యోగీంద్రునా
న్నత్యం బొంది తనంతికంబున ధరానాకంబో! నా మాఱునా
దిత్యద్వేషిపురంబు దంబు హనుమద్దేవుండు వీక్షింపఁగన్. 63

## సూర్యాస్తమయవర్ణనము.

చ. రిపుపరిభేదనంబు నొనరించి ప్రతాపము మించఁగా ననం
తపథమునందుఁ ద్రిమ్మరి పసంపడి దక్కి బయల్పడంగ మో
హావురుఁ గేటికాంతుని క్రియన్ మునుఁ గెంపు నటంపుఁ గెంపుతో
నపరదిశాంగనం గదిసె నర్కుఁడు తీవ్రత మాని యయ్యెడన్. 64

మ. చరమక్ష్మాధరగైరికప్రభల నాచ్ఛాదించి వైయచ్చరాం
బురుహాక్షీమణిహైమకంకణఘృణిస్ఫూర్తిన్ విడంబించి సా
గరరాట్తుంగతరంగవిద్రుమలతాకాంతిం బ్రదీపించె న
జ్జరతార్కద్యుతి శోణమృత్కలన నాశాకుడ్యభాగంబులన్. 65

చ. ఉదయధరాధరాగ్రమున నుండియు నస్తముఁ జెందఁ దాను ము
ప్పదిగడియల్ ప్రయాసపడుపద్ధతి నొక్కక్షణంబులోపలం
బదములు నిల్పినట్టిహనుమంతుఁడు చూడఁగ నెట్టు నిల్వఁబో
యెద ననుసిగ్గుచేబలె దినేంద్రుఁడు పశ్చిమవార్ధిఁ గ్రుంకినన్. 66

చ. తడవుగ నెంతయేని వడి దవ్వుఁ జరించుటఁజేసి మిత్రుఁ డ
బ్బడలిక దీర్పఁ జేరుటను బశ్చిమదిక్పతినిల్పు వేడుకన్

విడివి ఘటించి చుట్టు నొదవించిన బొక్కపుటింద్రగోపపుం
దెకఁగునరాతిరీతిఁ గనిపించెను వద్దిశ సాంధ్యరాగముల్. 67
సీ. సంచరద్యామినీచరవీరఘోరాంగముల మషిచ్ఛాయతో ముచ్చటాడి
సంకేతపదసమాశ్రయ పాంసులాంగీలచేల కాంతులతోడఁ జెలిమి చేసి
వికసితేందీవరప్రకరచంచద్దళ ప్రత్యగ్రరుచులపై బారు దీఱి
గిరిగుహానిర్గచ్ఛదురుమత్తకరిఘటాచటులదేహశ్రీల సంస్పృశించి
తే. నయనయుగళసముస్మీలనంబువలన, బ్రాణికోటి కప్రయోజనభావముగను
సూఁదిమొనకైన భేదింపఁ జొరనిదగుచు, గాఢతిమిరంబు దిక్కుటంగముల నిండె.
తే. అభ్రఫలకంబు సకలశబ్దాపిదేవ,తాసహాంబ్బపుటక్ సమయాఖ్యచిత్రు
దర్చనావేళఁ జిలికింప నమరుచంద,సంపుఁజిదురుపలన నుడుల్ సొంపు మీఱె. 69
చ. అలవిధిపేరియొజ్జలు వియత్ఫలకంబునఁ గాలబాలుకే
లలవడఁ జేయఁబూని వలయంబుగఁ జుట్టిన వానిలోపలం
బలుమఱు దిద్దఁగా మొదటిబా గఱె యంతయు నిండికొన్నసు
న్నలో యివి నాఁగఁ దారలు గనంబడియెన్ బలుబంతు లేర్పడన్. 70
చ. తనరుచి దిక్కుడుంగములఁ దార్కొనుచీఁకటిఁ ద్రోయఁబోక చం
కనదురురత్నకుండలయుగప్రభ లంబర మొందనీక య
ప్పెనుతిమిరంబు పెం పడర భీషణవేషము దాఁచి కొంచెమై
హనుమ యవిద్యమాక నసద్దైనములుండెడునాత్మ నాఁ దగెన్. 71
క. నెలవునఁ బెన్నిధి దొరయం, దలఁచినజనుఁ డితరజనులదంపడి జడియన్
వలసినగతి నినుఁ గనుఁగొన, నలపురిసంపడి యడంగ ననిలజుఁ డెంచెన్. 72
క. తఱి యెంచి పొంచి లంకా,పురియంతయుఁ గాంచి నిన్నుఁ బొడఁ గని చిదపన్
మెఱసినయనిలజుబల మీ, వెఱఁగినదే యనుచు రాముఁ డింతికిఁ దెలిపెన్. 73

ఆంజనేయుని సీతాసందర్శనాదివృత్తాంతము.

క. అనిన నరుంధతి పెనిమిటిఁ, గని గౌతమసూతి పరమకరుణాకరపా
వని లంక వెదకి జానకిఁ, గనిచేసినబలిమిఁ దెలుపఁగాఁ దగు నన్నన్. 74
తే. ఆవసిష్ఠుండు పలికె న ట్లాంజనేయుఁ, డసురపురి డాసి యసమసాహసవిలాస
భాసమానస్వభావుఁడై ప్రతిభటాళి,కలకలము వాయునందాఁకఁ గాచి యున్న.
సీ. కోలాహలధ్వనుల్ కొంచెమై యటమీఁదఁ గోటవాకిటివారిగుఱుక లెచ్చెఁ
గటువార్త లెడలి యంతట దైత్యకాంతల కలుపరింతలు వింత వెలువరించె

సరసోక్తు లుడిగి విశ్రాంతిమై నట కూడు కొలయుదంపతులయూర్పులు సెలంగ
సకలేంద్రియోవ్యావృత్తి సడలి పిమ్మటఁ బౌరజనులరూపుల వివశత్వ మొందె
తే. నట్టిసమయాన గజసమయాన నరయఁ, దత్తఱంబున నుత్తరద్వారమునను
జొచ్చి చనుచోటఁ జెడ సొచ్చి వచ్చులంక,బింకమడఁగించి సామీరి పెంపుమీఱ.
క. సాలముల సాలసాలక,సాలముల నిరుద్ధసురఖచరబాలనిశా
పాలికలకేళికాగృహ,పాళికల లతాంగి వెదకి పావని యవలన్. 77
చ. పరుల కదృశ్యుండై యసురభర్తవిలాసగృహంబు చూచి త
త్పరిసరభూమిఁ రమ్యమణిభర్మవినిర్మితనర్మహర్మ్యముం
దొరసి సమార్ధ్వమం బరసి తోయజపాణిఁ గాన లేక వా
నరపతి కొంత చింతిలి మనంబున నిట్లని యెంచె వెండియున్. 78
ఉ. ఏలిక దొడ్డవాఁడ వని యెల్లకపుల్ విన సన్నుతించినన్
వాలికతోఁక పెంచుకొని వచ్చితి నిక్కము చూచి వచ్చెదన్
బాలిక నంచు నాప్రతిన భంగము గాఁ సతిఁ గాన నన్విష
జ్వాలికవంటివార్త యిఁక స్వామికి నే మని విన్నవింపుదున్. 79
. క్రిందమీఁదై యొద్దగిలఁ జుల్కఁగాఁ గేలఁ గబళింతునో! యజాండకర్పరముల
ఫణి ఘోణి ముదికచ్ఛపముపీఁపుఁ బ్రాపింప నడఁగఁద్రొక్కుదునో! హేమాచలంబుఁ
బాలపోలిక వాలలీల జల్లన నేల రాలఁజేయుదునో! తారావ్రజంబుఁ
దొండముల్ దునిఁగి వేదండముల్ గీఁపెట్ట నొక్కుచో వైతునో! దిక్కు లెల్ల.
తే. నింత చేసిన బ్రహ్మరుద్రేంద్రవహ్ని
ముఖ్యదివిజాధినాయకుల్ ముదిత యున్న
సెలవు చూపెద రని యెంచి యలుకఁ బెంచి
హర్మ్యశిఖరాగ్ర మెక్కి యయ్యగ్రభూమి. 80
ఉ. అక్షయపుణ్యశాలి మరుదాత్మజుఁ డయ్యెడఁ గాంచె శింశుపా
వృక్షము స్వప్రసూనపరివేష్టితకాంచ్యరుణీకృతక్షపా
ధ్యక్షము ప్రత్యహస్స్ఫురదుదగ్రలతాగ్రనిరుద్ధభానుచ
క్రాక్షము సంధకారిస్పృజనార్హదశాకలితాంతరిక్షమున్. 81
ఉ. ఆయపరాజ మిట్లు గని యచ్చట సీతఁ గనం దలంచి హ
ర్మ్యాయతనంబు డిగ్గి మరుదాహతధ్వజకేతుఘంటికల్
మ్రోయుటలొప్పె సీత యిదె ముందరిసాలముక్రిందఁ జూడు పో
వోయి కుమార! యంచు నెన రూని సమీరుఁడు తెల్పెనో యనన్. 82

పంచచామరము. అపారదోఃప్రతాపశాలి యక్కపీశ్వరుండు కిం
శుపారసారుహాగ్ర మెక్కి సూక్ష్మకాయుఁడై తదీ
యపాదభూమి హైమవేదికాంతరస్థలంబునన్
క్షపాచరాంగనాగణంబుఁ గాంచి వారిలోపలన్. 83

ఉ. ధారుణి మైపరాగమువిధంబున లోచనబాష్పపూరిత్
సేచము విప్రయోగశిఖిసీటునఁ జేఁము వేఁడియూరు పై
మారుతముక్ మనోరథసమగ్రత వ్యోమము గోల్వఁగా జగ
త్కారిణలీలఁ జెల్వెడునొకానొకమానిని గానిపించినన్. 84

ఉ. ఆమహసీయధామ ''దురితాపహనామ! సమగ్రభోగసు
త్రామ! ద్విషద్విరామ! రఘురామ! పరామరిసింప వేమియున్
నామొఱ యేలొకో విన వనాథశరణ్యా! నృపాగ్రగణ్య; నా
స్వామి;'' యటంచుఁ జేరొక్కసఁగ జానకి యానని నిశ్చితాత్ముఁ డై. 85

ఉ. పట్టణ మంతయున్ వెదకి భాగ్యవశంబునఁ జూపఁగంటి నే
నిట్టియెడన్ లతాంగి నని యిచ్చఁ గపీశ్వరుఁ డుబ్బి యంతలో
బిట్టడ లూని కాంత దురపిల్లఁగ ''హా! రఘురామమోహపుం
బట్టపుదేవి కిట్టివెత పాటిలెనే!'' యని సాశ్రునేత్రుఁ డై. 86

శా. భర్త న్నమ్మఁగః బల్కినట్లు సతి చూపట్టన్ ముఖం బెచ్చెఁ గాం
తార్తత్వంబున వెచ్చ నెమ్మది ''సుఖస్యానంతరం దుఃఖ'' మన్
వార్తార్థంబు మదర్థ మయ్యె మిథిలానాథాత్మజాతార్థమై
స్ఫూర్తిం జెందదొకో తదన్యపదసంబోధంబు శోధింపఁగన్. 87

శా. శార్దూలీగణవేష్ట్యమానహరిణిం జంచత్కరిణ్యాళిస
మ్మర్దాంభోజినిఁబోలె రాక్షసవధూమధ్యంబునం గుందుచున్
దుర్దాంతవ్యథఁ జెందుచున్నసతి నేత్రోవన్ విచారింతు మ
న్నిర్దోషప్రియభాష లెవ్వ డిఁక విన్కిం జేతు నంచున్నెడన్. 88

శా. దోషాటాన్వయచక్రవర్తి మదనార్తుం డై ధరాపుత్రి దు
ర్భాషామార్గణపఙ్క్తి నొంప నతనిన్ భంజింప నుంకించి త
ద్రోషజ్వాలిక శేముషీజలముచేఁ దూలించి లేఖర్షభ
ద్వేషస్త్రీ త్రిజటాఖ్య చెప్పినకలన్ విభ్రాంతి నిద్రింపఁగన్. 89

క. సమయము గని కారుణ్యార్ద్రసమయహృదయుఁ డగుట శాఖిశాఖలు డిగి భూ
రమణీజాతకు సీతకుఁ, బ్రమదమున నమస్కరించి పావని పల్కెన్ 90

ఉ. రాముని బంటు మారుతవరంబున నంజనగర్భశుక్తికన్
మామక జన్మ మంబ హనుమంతుఁ డనం దగువాఁడ స్వామి మీ
సేమ మెఱింగి రమ్మనియెఁ జిత్తములో నను నమ్మ రేని యా
రాముని ముద్రికామణిఁ దిరంబుగఁ గన్గొనుఁ డంచు నిచ్చినన్. 91

సీ. అంగుళీయక మందిఁ గెంగేలఁ గొనినంత రమణిమైఁ బులకాంకురంబు లెనసె
రత్నముద్రిక సారెకును గన్గొనినంతఁ గలికి కానందాశ్రుకణము లురిలె
నూర్మికామణి చెక్కు లారయించుకొనినంతఁ గాంత దేహం బంత కంప మొందె
నుంగరం బొకయింత యురముఁ జేర్చినయంత నింతి బాహ్యాభ్యంతరేచ్ఛ మఱచెఁ

తే. జెలువుఁ డంటినఁ గనుఁగొన్నఁ జెక్కులమిన, నక్కుఁ జేర్చిన నేసుఖం బావహిల్లు
నా సుఖము ముద్రికాయుక్తిసైన వాయు,జునకుఁ బ్రత్యుపకృతి చేయ నుదతి మఱచె.

చ. జనకజ యీగతిన్ విభుని సన్నిధిఁ జెందినభంగి నుంగరం
బున ముద మంది తన్ దెలిసి ముందర బ్రాంజలి యైన యంజనా
తనయునిఁ గాంచి నీదయఁ గదా! జగదాదరణీయ రామభూ
జనవర భద్రముద్రిక ప్రసన్నతఁ జేసెఁ నాకుఁ బావనీ! 93

చ. రమణుఁడు సేసంగె నుంగరము రామ! కనుంగొను మన్నమాత్ర మే
ను మఱచి సొక్కి యొక్కటఁ గనుంగొనుచుండితిఁ గాని తత్ప్రమో
దమునకు నాదికారణ మితం డని నిన్ను నసైతి నెచ్చటన్
భ్రమద లెఱుంగనేర్తురె? కృపాసరోనర్చన మేలు మారుతీ! 94

శా. లోకుల్ ప్రాణమె ముఖ్యవస్తు వని యాలోకింతు రా ప్రాణమే
నాకు న్నిల్పితి నీకు డీవన వినా నాచేతఁ గా దొందు న
త్యాకల్పంబుగ వృద్ధిఁ బొందు మిఁక నీ వాకల్పపర్యంతమున్
గాకుత్స్థాన్వయరక్షణ(?)ఘృణాగణ్యప్రభావోదయా! 95

క. నా విని పావని త్రిభువన,పావనిఁ గని బంటు నేల ప్రశంసింపంగాఁ?
బోవలయు మీశిరోమణి, దేవీ! దయసేయుఁ డన క్షితిజ యిట్లనియెన్. 96

శా. ఆకారం బెఱిఁగించు ప్రజ్ఞ జనులం దట్లౌట నీ ప్రజ్ఞ కే
కాకారం బయి యుండ దీయొడలు సత్యం బైన నీ రూపమున్
నాకుం జూపక రత్నమే నొసఁగ నన్నట్ల కా నిమ్మటం
చా కారుణ్యపయోధి దివ్యతనులీలాశాపథారోధి యై. 97

సీ. తెలిచాయబలుసామితలప్రావుచెలిగంపుచిఱుగజ్జె లడుగుఁదామరల వఱలఁ
బుడమిమోవరి పాఁపపడగ గుంపులసొంపు విడిపింపుమై పెంపు వెలపు నెఱప

వినుమానికముచాలు గొనఁజాలుతనడాలు నలుదెస మిసమిసల్ గలయ వెలయఁ
దెఱగంటిదొరవింటినెఱివంటితెఱఁగంటి సరి గెంటినిడుతోఁక చపలఁ బొసల.
తే. మేలిజందెమ్ము కెమ్మోము కేలిమోడ్పుఁ, బసిఁడిముంజియుఁ గ్రొంబట్టుమిసిమి చేర
హనుమ మున్నిటిమొలనూలియన్నచూలి, కన్నుఁగవ కచ్చెరువు గాఁగఁ గానిపించె.

క. ఇప్పుగిది గాడ్పుఁగొమరుని, గొప్పశరీరంబు చూచి కోమలి మదిలో
నప్పు డెరు దింపు వెఱపును, ముప్పిరిగొనఁ గన్నుదోయి మోడ్పునఁ బలికెన్. 99

మ. విపులాకారుఁడ వై జగత్త్రితయ మావేశించుసర్వాత్ము నిన్
గపిసామాన్యునిఁ గాఁ దలంచితిని చక్రం జూడఁగా శక్యమే?
చపలాలోకల మైనమాదృశలకున్ జాలున్ భయం బయ్యెడున్
గృప నీయెప్పటిసూక్ష్మరూపమునఁ దంత్రీ! నిల్వవే వేఁడెదన్. 100

క. ఆపాథోనిధిఁ గడచిన, కైపున నాదుఃఖవార్ధి గడగాంచుటకై
నాపాలిభాగ్యమే నీరూపంబు వహించె నో మరుత్ప్రియతనయా! 101

క. అని యనితరహితభణితిన్, వినుతింపఁగ నేపమానవిభు దఁది మునుం
గనిపించినటుల నిలిచిన, యనిలజునకు మఱి యొసంగి యవనిజ పలికెన్. 102

క. వసుషేశుఁ బాసి పదినెల, లసువులఁ బట్టితి భరింప నతిభర మింకన్
మసలిన నసురేంద్రుఁడు నా,కసుర(?)నని హనుమ! యనుమా విభుతోన్. 103

సీ. ననుఁ బ్రధానంబుగాఁగొనుటచేఁ దన కీశ్వరత హెచ్చె ననెడు గారవపుమాట
నేను గల్గకయున్నఁ దా నేవిలాసంబుఁ బొరయఁబో ననెడి యబ్బురపుమాట
క్షణము నన్ బాసిన జగ మంత శూన్యమే యొండు గన్పడ దన్ననిండుమాట
నిగుణావళిఁ గూడునే యిట్ట దని నాఁడు సన్నుతింపఁగ నన్నచనువుమాట
తే. ప్రేమ మున్నాడి మున్నాడి పెంపు సేయు, టెఱుఁగఁడే సర్వసాక్షి యొనిపుడు పేక్ష
సేల గావించెనని మీఱి రోసు దూఱి, పలికినా నని విపరింపు భర్తకనిన. 104

ఉ. తెమ్మెరమాలి మ్రొక్కి జగతీపతికెన్ భవదుక్త లెల్ల ని
క్కమ్ముగ విన్నవించెద నిఁకన్ వెత చెందకు నీముదశ్రువ
ర్షమ్ము నకాదిగర్జయగు రామఘనుద్గుణఘోషణంబు మా
యమ్మ! నిజమ్ము నమ్ము మని యాయమ వీడ్కొని వేడ్క మీఱఁగన్. 105

మ. సుమనోగంధవివర్ధనస్థితి ద్విజస్తోమధ్వనిప్రాప్తి దీ
ప్రమధుప్రస్ఫుటతం బ్రశాంతకలనాభంగిం బలాశిత్వముం
దమయందుం గనిపించె వీనిఁ దొలుతన్ దండింతు నన్నట్టు ల
త్యమితోద్వృత్తిఁ బెకల్చె వాయుజుఁ డశోకానోకహానీకమున్. 106

వ. మఱియును. 107

స్రగ్ధర.—
కూల్చెన్ శాఖోపశాఖల్ కుసుమవిసరముల్ కుట్మలంబుల్ దళంబుల్
వ్రాల్చెన్ రాల్చెన్ ఫలంబుల్ వనచరఖచరస్వామి తద్రక్షకాళిన్
గాల్చెన్ బంపెన్ జగిల్చెన్ గిలకిలనగుచున్ గింకఁ ద్రెంచె మేడల్
బోల్చెన్ రత్నాంబుధారోద్ధురతర మకరికాతోరణారూఢిఁ బోల్చెన్. 108

తే. సకలబలహేతుభూతపంచకముకడిమి, జాల్చి సప్తప్రధానాత్మజవ్యసనము
లడఁచి విజితాత్ముఁడై సుస్థిరాత్ముఁడౌచు, నతిశయిల సంతసిల్లె నయ్యనిలభవుండు.

మ. నిత్యశోకాపనయార్థి రావణి జగద్విఖ్యాతయంభూతరం
బతిగర్వంబున నైనఁ బుష్పకముఁ ద్రోయం జాలియున్ ధాతృదే
వత నిత్థించినయం రావణస్థితి గనన్ వాంఛించియున్ ధీరుఁడై
హుతభుక్సత్రవనంబు కట్టువడిన ట్లుండెన్ విలాసంబునన్. 110

మ. అసమబ్రహ్మశరోగ్రతాగ్రసనలీలాగాత్రుఁ డద్గంధవా
హసుతుం డగ్గలి యున్న ఘోరభవపాశాయాసవిధ్వంసన
వ్యసనుం డిప్పటిత్రాళ్ల నిల్వఁ గలఁడో తన్మేఘనాదుండు పా
తసమావేశితుఁ జేసెఁ దామసమతుల్ సర్వంబుఁ జింతింతురే. 111

మ. దివిషద్ద్రోహి మహోగ్రపాశములు సంధింపంగ బంధింపఁగా
వివశుండుంబలె మారకుండె సుహసావిశ్రాంతలీలన్ గపి
ప్రవరుం డయ్యెడఁ గొంచుఁబోయి జనకాభ్యాశంబునం దుంచ దా
నవమూర్ధన్యుఁ డమర్షసంతురితదంభధ్వానుఁడై యిట్లనున్. 112

శా. ఆగ్రామలకున్ బ్రయాణ మగలంకావాసమున్ జొచ్చి నన్
లేశంబుం గయికొనక కేళివనపాలం గూల్చి రక్షచ్ఛటా
నాశం బక్షహృతిన్ ఘటించినమదోన్మత్తుండ వెవ్వాఁడ వో
రి శాఖామృగ! యెవ్వ రంపి రిట వారిం జెప్పరా నావుడున్. 113

చ. ఉరవుగఁ జుట్ట చుట్టుకొనియున్న మహాఫణి నాఁగఁ జుట్టునుం
బరివృతవాలవల్లి దగఁ బాలసముద్రములీల వత్సభాం
తరళశశికాంతవేది జిగి దాల్ప నెదన్ ధృతిలక్ష్మి హెచ్చఁగా
హరి పలికెన్ బ్రకర్షసమయాబ్దబృహద్రవగర్భితార్భటిన్. 114

శా. స్వామిద్రోహి! దశాస్య! యోరి! వినురా సాక్షాద్రమాధ్యక్షుఁ డా
రామక్ష్మాపతిబంట వాయుజుఁడఁ జద్రాకేందుబింబాననా

క్షేమం బారయ వచ్చి యిచ్చట లతాంగిం జూచి యస్మద్భుజా
సామర్థ్యంబొకయింత నీకుఁ గనిపింపంజేసి నిన్ బోవుచున్. 115

ఉ. నావినుతప్రతాపకలనం గలనం జలనంబు నొంద కిం
దేవడిబంటు నిల్చుఁ? దగదీపగ దీఱఁగ దీనతోషు సీ
తావిభుఁ జేరి మీఱవలదా? కలదాని యిలఁ దాస్యగర్థ మో
రావణ! నాదుబుద్ధి వినురా కినరాకనురా శుభస్థితుల్. 116

క. కైలాసశైలచలనా,ఖిలభవద్భుజబలాసభేదనలీలా
లోలగిరీశశరాసా,భాళిస కవనిజ నొసఁగి బ్రతుకుము మన్నన్. 117

ఉ. ఆహనుమంతుమాటల దురాగ్రహుఁడై దశకంఠుఁ డుద్ధతా
జ్యాహుతివర్ధమానదహనాకృతి దగ్గఱివారిఁ జూచి తా
ద్రోహ మొనర్చియున్ వెఱక త్రుళ్లెడునివ్వడ క్రోఁతి వీనిమీ
రాహుతి సల్పుఁ డన్న విని యన్నకు మ్రొక్కి విభీషణుం డనున్. 118

చ. అలయక స్వామికార్యపరులై పఱతెంచినవార లెన్నిభం
గుల నయినన్ వధింగుపలుకుల్ పచరింపుచు రవ్విషంబు దూ
తలకు స్వభావ మిం పలుగ ధర్మముగాఁ బటులైనఁ జిత్తము
పలుక శమింపజేసి తగిన ట్లొకదండన కానఁగింప నన్. 119

క. ఈయపవిద్ధిష్ఠురిం గొని,పోయివెసం దోఁక గాల్చి పోనిం డని పై
తేయాగ్రజి సెలవిచ్చిన, నాయనఁ గని దైత్యు లత్యుదాత్తస్ఫూర్తిన్. 120

క. పట్టిరి పవనజు మోఁకులఁ, గట్టిరి తైలార్ద్రపటని కాయము తోఁకన్
జుట్టిరి బెట్టుగ మంటలు,వెట్టిరి రాక్షసులు లోకభీకరభంగిన్. 121

శా. రక్షోవంశవినాశహేతుభృతిజాగ్రద్ధూమకేతుస్థితిన్
వీక్షింపన్ శిఖిభీమలూమలతలో వీరచ్ఛటాఢ్యత్వుఁడ
య్యక్షారాతి చరించుటల్ గని తనన్ బ్రార్థించుసీతాపవో
దాక్షిప్రార్థనఁ జల్లనై యపుడు స్వాంతోభర్త తోఁ జేటయున్. 122

సీ. సుర లుపద్రష్ట లుద్ధరసింహనాదంబు శ్రుతిసూత్రనికరంబు దితిజకులము
పశుకోటి గృహదారుపటల మింధనరాశి కోపవహ్ని మహాప్రతాపవహ్ని
లాంగూలవహ్ని గూడంగ వహ్నిత్రయప్రజ్వలజ్జ్వాలికావాళి లంకఁ
బూర్ణాహుతిగ రామభూమీశ్వరార్పణబుద్ధిమైఁ గావించి పౌలఁతి గాంచి
తే. సౌఖ్యవారిధి నవభృథస్నాత యగుచు,సాహసకళావిశారదుఁ డపుడ మరలి
కడలి లంఘించి యవ్వలికడ వసించు, వానరుల సమ్ముఖతఁ జెందివచ్చునపుడు. 123

ఉ. అంబుధరధ్వనిన్ శిఖిచయంబన మారుతిసింహగర్జన
జ్జాంబవదాదు లుబ్బి సతిజాడ గనుంగొను టెంచి హర్షబా
ష్పాంబునదీవఘూటికల నంబుధిదం బడఁగించి విక్రమా
డంబరు లక్కపూతివని దగ్గఱి దుండగముల్ ఘటింపఁగన్. 124

క. దధిముఖుచే రవిసుతుఁ డవ్విధ మెఱిఁగియుఁ గినుక గనక వెసఁ బిలిపింపన్
గపివరచరుల్ చని సుగుణాంబుధి రఘుపతిఁ గాంచి రనిలపుత్రుం డంతన్. 125

సీ. అవిశారలీలఁ గేల్దన నిటలతటంబు గదియించి నృప! కంటిఁ గలువకంటిఁ
దనువు క్రిందవసించి స్థిరదృష్టి వహియించి యుపవాసముల డక్కియొఱపు దక్కి
నెఱికురుల్ జడగట్టి తెరలుచూపు బట్టి భావంబు నీయెడఁ జేర్చి బాధ నోర్చి
నీనామమె జపంబుగా నుగ్రపుఁదపంబు గావించునటు లున్నగతిఁ గన్నఁ

తే. గంటకున్నె? మనం బశోకవనరాశి, దాసియును శోకవనరాశి గాసిఁ జెందు
చున్న యన్నాతి కీవు ప్రసన్నుఁడవిఁకఁ, గాక మది గాఁక యేజోకఁ గడపఁగలదు?

క. అని తెలిపి తానుదధిదాఁటినగతి మొదలుకొని యట ఘటించినపని సూ
చన చేసి జీవమణి యిచ్చినగతి సతిరత్న మొసఁగ శ్రీరఘుపతియున్. 127

మ. అది గన్నన్ మదినున్న తాప మెడఁబాయన్ జేయఁ గన్నట్టు లిం
పొదవం బావనిఁ జూచి యీయనితరోద్యోగప్రతాపక్రియా
సముపాయస్థితు లెందు నుంగలవె? యస్మద్వంశసంరక్షణం
బు దయం జేయనె నీశుభోదయము గాఁబోలుం గపిగ్రామణీ! 128

మ. శ్వసనోదగ్రజవోగ్రధాటిఁ బటిసీ చక్రేశ్వరుం డాఁటిపో
వనమే? దాఁటినచో సుపర్వభయదస్వైరప్రచారాఢ్యుఁ డా
యసురగ్రామణివీడు చూడఁ దరమే? యట్లైన నిరతిశౌ
ర్యసముద్రేకతఁ జొచ్చి శత్రుహ్రుతి సేయం గూడునే? పావనీ! 129

మ. పవనుండున్ గరుడుండు మర్భరగతిన్ బారావరోల్లంఘన
ప్రవణప్రక్రము లింతె గానిపని దీర్పన్ లేరు వారుండనీ
యవలం బోయినరుద్రుఁ డైన మరలన్ ప్రాణాన రానోపునే?
జవముం దేజము మించ నీకిటు ఘటించం జెల్లెఁగా కెల్లెడన్. 130

మ. కృతకృత్యుండవు నీప్రతాపజవకీర్తిస్ఫూర్తిఁ గీర్తింపఁగాఁ
జతురాస్యుండును నోపఁ డన్యజనతాసాధ్యక్రియల్ నీవు
చేసితి గానన్ బ్రతి గాననైన నిదె సంశ్లేషింతుఁ బాటింపుమా
ప్రతికారంబుగ నంచుఁ గౌఁగిటను సంభావించె వాయ్వర్భకున్. 131

ఉ. అంకిలిలోన నిట్లు పవనాత్మజుఁ గూరిమిఁ జేసి డాసి వా
ర్ధిం దరియించి రావణు వధించి మరుత్సుతుసూక్తి నుత్సవం
బొందినసీతఁ గైకొని యయోధ్యకు రాఘవుఁ డేఁగ నాశతా
నందుఁ డరుంధతీప్రభు ననంతమణిప్రభుఁ గాంచి యిట్లనున్. 132

శా. ప్రాణేశుం బెడఁబాసి ప్రాణ మెడలింపం బూనుసీతాసతిన్
బ్రాణాపేక్ష భరింపఁజేసినజగత్ప్రాణాత్మజున్ సర్వగీ
ర్వాణప్రస్తుతశౌర్యు వెండియును వినన్ వాంఛించుచున్నాఁడఁ ద
ద్వాణీదేవతఁ దత్కథానుగతిఁ జెంపం జేయవే నావుడున్. 133

పంచచామరము. భగీరథోర్వరాధిరాట్తపఃప్రసన్నపన్నగ
ప్రగూర్ధ్వమార్గనిర్గళత్తరంగిణీతరంగసం
ఘగర్భితార్భటిన్ వచఃప్రగల్భతావిభూతివా
సిగా వయోగరిష్ఠుఁ డవ్వసిష్ఠుఁ డప్పు డిట్లనున్. 134

మ. అనఘాగ్రేసర! బ్రహ్మకైన నుతిసేయన్ రానిసంజీవరా
యనిచారిత్రము లే నుతింపఁగలనా? యైనన్ విదేహాత్మజా
వనమే కాకతఁ డాత్మ రామహితభావం బూని పెక్కండ్రఁ బ్రో
చినయాశ్చర్యకరప్రభావములు సంక్షేపంబుగాఁ జెప్పెదన్. 135

సీ. సౌహృదస్థితి విభీషణునియం దెఱిఁగించి పతిఁ జేర్చి స్థిరరాజ్యపదవిఁ గూర్చెఁ
బెద్దనిద్దురవోవుపెనుమూఁకల విశల్యకరణిఁ దెచ్చిగ మేలుకన నొనర్చెఁ
గలనఁ గూలినరాముగారాబుతమ్ముని ప్రాణముల్ క్రమ్మఱఁ బడయనేర్చెఁ
దనవాగమృతధార మొనయించి భరతేంద్రుగాఢశోకజ్వాల కడకుఁ జార్చెఁ
తే. గవనమునఁ బెక్కుదనుజులమదములార్చె, మఱియుఁ బఱచైనమహిమముల్ దొరసి పేర్చె
పవనతనయుండు శ్రీరామభద్రభద్ర, నయకునిజరూపమునకు భేదంబు లేమి. 136

క. హాయనకోటులు సను రా, మాయణకథ యనెడుహేమమాలికకు మహా
నాయకరత్నం బగురఘు, నాయకభటుమహిమవర్ణనల్ గావింపన్. 137

సీ. వినుము శతానంద! మును రాముఁ డంజనాసుతునిచే జానకీస్థితి యెఱింగి
దశకంధరజిగీష దక్షిణాంబుధియోర వీరవానరులతో విడిసియున్న
నది విని దుర్జయుం డగునిర్జరారాతి దుర్జాతిమంత్రులఁ గర్జ నుడుగ
దుర్మంత్ర మెఱిఁగింపఁ దొడఁగిన ధర్మార్థకామమోక్షములకుఁ గాని తెరువు
తే. పరవధూసంగమాపేక్ష పరవధూటి, మాత్ర మాసీత లోకైకమాత యామె
కెగ్గు గావించి చెడ నేల? యిమ్ము రామ, చంద్రునకు సీత నని విభీషణుఁడు దెల్పు.

చ. అవిరళకావ్యగౌరవసమర్థతఁ జెందుకవీంద్రు మాట లొం
దువిధిఁ దలంచుచుం దనకఠోరపదాహతిఁ జూపఁ బూనుదు
ష్కవివలెఁ దామసీచరశిఖామణి తమ్ముని బుద్ధిమాట లొం
దువిధిఁ దలంచుచుం దనకఠోరపదాహతిఁ జూపె నేపునన్. 139

మ. ఘనకర్మానుగమైన కాయమునకున్ గాలంబు పర్యాప్తిఁ జెం
దిన నంతఃకరణంబుతోఁ దగుగతిన్ దీపింపఁగాఁబోవు జీ
వునితోవన్ సహితుం డతండు జముతావున్ జెందఁ గాలంబు డా
సినపౌలస్త్యనివాసు వీడి వఱలెంచెన్ రామసేవార్థియై. 140

ఉ. కాకులమూఁకలోఁ జెరిఁగి కమ్మనిక్రొవ్విరివేళ యైనచోఁ
గాకికుహూకృతుల్ విని వగన్ జెగడించిన గుంపువాయుపుం
స్కోకిలముంబలెం దశముఖుం బెడఁబాసి విభీషణాసురుం
డీకడ రాఁ గనుంగొని దినేంద్రకుమారుఁడు సేనతో ననున్. 141

క. కంటిరె! కపు లదె మింటన్, వెంటన్ హితు లంట వచ్చువీనిన్ దివిష
త్కంటకుని గెంటుఁ దంటకుఁ, గంటకతరు లూనువారిఁ గని యతఁ డనియెన్.

పంచచామరము.—

వలీముఖేంద్రులార! మీకు బంధుఁడన్ మరుద్విష
త్కులీనుఁడన్ మలీమసాత్మకున్ దశాస్యుఁ బాసి ని
శ్చలప్రపత్తియుక్తి రామచంద్రుఁ జేరితిన్ మదా
విలత్వ మీరు సామిఁ జేరి విన్నవింపరే యనన్. 143

క. అక్కపు లక్కజ మెక్కుడు, రక్కసునుడివడువు నోడువ రవిసుతుఁ డదిరా!
యెక్కడిపని? యని రాముని, చక్కికిఁ జని మ్రొక్కి పటువచనరచన ననున్. 144

క. రావణునితమ్ముఁడఁట! బలు, కావరమున నున్నయన్నఁ గా దని మిమ్మున్
సేవింప వచ్చినాఁడఁట!, యీవింతలు వింటిరే నరేశ్వరతిలకా! 145

శా. భాషం గూర్పరు బుద్ధి బుద్ధిపటిమం బాటింప రుగ్రక్రియల్
దోషం బన్న నొకింతయుం దలఁప రెందుం దూషితస్వాంతు లీ
దోషాటుల్ బహువేషధారులు మదాంధుల్ వీరిఁ జిత్తంబులో
లేశన్మాత్రము నమ్మి చేకొనఁగరా దిక్ష్వాకువంశోత్తమా! 146

క. మార్తుఁ డని విన్నవించితి, వార్తల కెడ యేమి స్వామివారికి బుద్ధిన్
వర్తించినటు లొనర్చుటె, కర్తవ్యం బనిన జనకకన్యాధిపుఁడున్. 147

ఉ. చెంగటిమంత్రులం గని వచించెఁ గపీశ్వరులార! యన్నతో
డం గలహించి వచ్చెనొ హితంబుగ సంధి ఘటింప వచ్చెనో
యింగిత మేమియో తెలియకే మన కీతని వీడనాడుటల్
సంగతిగా దెఱుంగ నగుజాడ లెఱిం గెఱిఁగింపుఁ డీ రనన్. 148

క. సుగ్రీవుఁ డనియె నీతిస,మగ్రత మన్నింప మమ్ము నడుగుటగా కా
ర్యాగ్రణి! మీ రెఱుఁగని కా,ర్యగ్రహణము లేమి యున్నవని పలికినచోన్.

సీ. శత్రుం డతనిగూర్చి మైత్రిచింతఘటింపరా దని పల్కెఁ దారాసుతుండు
తఱిగానితఱి వచ్చు టరయంగ సంశయావస్థాస్థుఁ డని జాంబవంతుఁ డనియెఁ
దగువానిఁ బంపి చిత్త మెఱుంగకయె తోడిఁ బడఁగూడ గడుసని నొడివె శరభుఁ
డదియెనిక్కము వీనిహృదయమర్మ మెఱుంగ దొరయుమేలనుచు మైందుఁడు వచించె

తే. నిర్విషంబునఁ దమతమయిచ్ఛ నెనసి, వచ్చు హెచ్చున వాక్రుచ్చువార్తలు విని
యార్తరక్షాపరాయణుం డాంజనేయుఁ, డన్నరేంద్రున కిటు లని విన్నవించె. 150

తే. అవధరింపుము శరణాగతార్తిహరణ!, మీ ప్రధానులపలుకు లేమియు శుభంబు
లనుసరింపమిఁ గార్యబాహ్యములు దోష,హేతువులు గాఁ దలంచెద నెట్టు లనిన.

మ. పరమర్మంబు లెఱుంగఁ గోరుకుమతుల్ ప్రాగ్రూపమే పూని వ
త్తురె? వేషాంతర మొందినం బలుకులం దుర్భావసద్భావముల్
పరిశీలింపఁగరాదె? లోఁ బ్రబలమా భావంబు నాకారవై
ఖరి మాటంగలఁడే? విధాతయు బలాత్కారంబునన్ రాఘవా! 152

ఉ. రావణుతోడ నన్నపుడె రాక్షసుఁ జంపుట సొం పటంచు సు
గ్రీవుఁడు తెల్పె రావణునికిల్బిష మీతనిఁ జెంది యున్నదే?
రావణుతమ్ముఁ డైకొనియె రాముఁడు దీనశరణ్యుఁ డన్నచో
దేవర కింతకంటెను బ్రతిష్ఠ మఱిం గలదే? జగంబునన్. 153

ఉ. ఆదశకంఠుసోదరుఁడ నౌదు భయార్తుఁడఁగల్ల నాయెడన్
లేదు దురుక్తి కాదు మరలింపక సామికి విన్నవింపరే
యాదృతి నింపరే యనఁగ నంగదుఁ డీతనిశత్రుఁ డంచు నా
హా! దయ లేక పల్కె శరణాగతభావము శత్రుభావమే? 154

సీ. వార్ధి దాఁటినమీఁద వచ్చె నేనియు శత్రుదేశంబు గాన సందియముఁ జెంది
యభయ మియ్యరటంచు నటు గాక ముందర నరుగుదెంచుట సదేశాగతుండు
దమయన్నక్రోధంబు దైత్యవంశవినాశ మెదుటిజయంబు నూహించి సమర
మొదవకమును వచ్చు టుచితకాలజ్ఞుండుగావున దేశంబు గాల మరయ

తే. కీశఁ డే తెంచె ననునీతి నీతి గాదు, కూహకము చేయ వచ్చినకుచ్ఛితుండు
దూత నంపిన హృదయరీతుల నొడువునె?, శరభమైందులనుడి కార్యసరణి గాదు.

ఉ. సా దుపకారి గోల గుణశాలి యితం డితఁ డాడుమాటలన్
భేద మొకింతయేని కనిపింపద యన్న కుబుద్ధి చెప్పినన్
గా దని తన్ను బంపెఱుఁగన్ వివరించఁగ సంశయించఁగా
రా దది గాక యీపవనజరత్నముచిత్తము నే నెఱుంగుదున్. 156

చ. చలమున రాక్షసక్షయము సల్పనయీసున నన్వధింపఁగాఁ
దలఁచినపఙ్క్తికంఠునకు ధర్మము నామదికిన్ హితంబుగాఁ
బలికినపుణ్యుఁ డీతనిస్వభావము ధర్మమయం బటంచు నేఁ
దెలిసితి నాఁటనుండి జగతీవర! సందియ మొంద నేటికిన్? 157

మ. కినుకన్ వాలి వధించి భానుజునిఁ గిష్కింధాపురిం బట్టభ
ద్రునిఁ గావించినరీతిఁ బఙ్క్తిముఖునిం దూలించి లంకాపురం
బన పాయస్థితి నిత్తు రంచు నభయం బర్థించి రాఁబోలు తే
మనలో నీఘనుఁ డున్న దానవకులమర్మంబుల్ ప్రకాశం బగున్. 158

క. ఇరవుకొను తెరువు దోఁచిన, వెరవునఁ దేవరకు విన్నవించితి ననినన్
దిరువడినుడిహరువిడి మదిఁ, బరువడి రఘువీరుఁ డనియె భానుజుతోడన్. 159

క. మ్రొక్కిన చేతులు గోయుట, రక్కొను నే మమ్మువంటిరాజుల యిందున్
దక్కక యభయం బిచ్చితి, గ్రక్కునఁ దోడితెమ్ము పొమ్ము రాక్షసరాజున్. 160

తే. అనిన సౌమిత్రి మైత్రి వాగాత్మమైత్రి
నెంత దెలిపిన వినఁడయ్యె నీశ్వరుండు
కార్యభాగంబు హృదయ సంగతి యెఱింగి
విన్నవించిన వటుసూక్తి వినుటఁ జేసి. 161

క. ఇనతనుజాంగదజాంబవ, దనుజోక్తులు వినక ప్రియములాడె నితఁడు మున్
వన కనినమాట వినియెన్, హనుమపయిని స్వామిప్రేమ మతిశయముగదా! 162

క. రాముని సేవ మెఱుగును, సామీరి సమీరసుతునిస్వాంత మెఱుంగున్
రాముం డితరేతరప్రియు, లామహితాత్మకులఁ బరుల కలవియె తెలియన్? 163

మ. కుటిలవిఘాతి యైనతనుఁ గూర్చి హితం బతఁ డాడకుండెఁబో
కటువగునోటు తద్గుణము గ్రాహ్యము సేయుటగాక చేసె నా
కట నుపకార మంచు సమయంబునఁ దెల్పి తదీయకార్యసం
ఘటన మొనర్చె వాయుజుఁ డకారణబాంధవుఁ డెంచి చూడఁగన్. 164

ఉ. ఇంచుక మాటమే లెఱింగి యెవ్వరు పల్కినపల్కులన్ నివా
రించి మహోపకార మొనరించె విభీషణుఁ గూర్చి పెద్దకై
యుంచినమంచిమాట పరమోద్భవసంపద నింపకుండునే?
మంచిధరిత్రి విత్తినసమంచితబీజము రిత్తపోవునే? 165

తే. ఈవిధంబునఁ బలిపల్కి నిసకుమారుఁ
డచ్చెరువు గాంచి నుతియించి యపుడె వేయి
యావిభీషణుఁ దోడ్తేర నధికభక్తి
నతఁడు సాష్టాంగ మెరఁగి యిట్లని నుతించె. 166

క. కాకుత్స్థతిలక! హతసత, శోకా! వీరాధివీర! శుభదాకారా!
రాకేందువదన! కరుణా, లోక! శ్రీరామ! సుకృతలోకవిహారా! 167

క. నీవే దిక్కని వచ్చితి, దేవా! నీకంటె నన్యదేవత నెఱుఁగన్
సేవకుఁడఁ బ్రోవు మని నుతి, గావించిన రాముఁ డతనిఁ గౌఁగిట నుంచెన్. 168

మ. ఇనపుత్రాదు లపగ్రహప్రకృతిఁ గీడెంచంగ నాత్మీయమం
త్రసిరాశిం దెరలించి రామసునరారాతిప్రపాంచద్విలో
కనవృష్టిం బరితుష్టుఁ జేసి మఱి లంకారాజ్యపట్టాభిషే
చనసౌఖ్యం బొసఁగెన్ విభీషణునకున్ సామీరి సామాన్యుఁడే. 169

సీ. శక్తిత్రయాంగపంచకషడ్గుణాదూహపణితిమంత్రము దెల్పువట్ల మంత్రి
పనిచిన నెటువంటిపనియైన వంచింప కెలమిఁ గావించుతావులను భృత్యుఁ
డేల చింతిల నంచు జాలి గ్రమ్మినకూర్మిఁ బ్రకటించువేళల బాంధవుండు
మాటపొంది కెఱింగి మనసులోనె మెలంగి యింపొందుకఖుడుల నిష్టసఖుఁడు
తే. ప్రస్తుతు లొనర్చుచాటుల బట్టుసుకవి
తోడువినయంబు గనునెడఁ దోడుసుతుఁడు
తానయై రామవిభునిచిత్తంబు వడసె
గాడ్పుకొమరుండు పతి కేదుగడయుఁ గాఁడె? 170

చ. బలమున నీతి బుద్ధి మృదుభావమునన్ సరసోక్తి జెల్లని
వ్యల బహుకార్యనిర్వహణతాగతి సత్య వివేక కీర్తులన్
బలియుఁడు గాన మెప్పొసఁగె భర్తకు మారుతి యిట్టు లన్నిఁటన్
మెలకువ లేకయున్నఁ దరమే? నరనాథులకొల్వు సేయఁగన్. 171

తే. విను శతానంద! రామభూవిభునికరుణ, యాంజనేయునితోడు లే కనువుపడని
జాడ నొడివిరి వల్మీకసంభవాదు, లగుటఁ బరిపాటిఁ బత్కఫలాలకింపు. 172

తే. అని వసిష్ఠుండు మఱియు నిట్లనియె నట్లు
దానవునిఁ గూర్చికొని రఘూద్వహుఁ డతండు
తెలుప మూనాళ్లు వార్థిఁ బ్రార్థించి పిదప
నలవు గుందించి మ్రొక్కిన నభయ మొసఁగె. 173

క. వారిధి సేతువు గట్టఁగ, నేరుచు నలుఁ డనిన ధారుణీపతి నలునిన్
గూరిచి పంపినవానర, వీరులు తరుగిరు లొసంగ వెసఁగట్టు నెడన్. 174

మ. మలయ ద్రోణ హిమాద్రి దుర్ధరకుభృ త్స్యంధాన వింధ్యాభిధా
చల నీలాచల హేమకూట నిషధ స్వర్ణాద్రి తారాదికా
చల శృంగంబు లసంఖ్యముల్ గొని వెసన్ సామీరి యేతెంచుఁ జే
తులఁ బార్శ్వంబుల వాలమం దురమునందున్ సందు లేకుండఁగన్. 175

మ. బహుభూజవ్రజరాజితక్షితిధరభ్రాజిష్ణుసర్వాంగుఁడై
బహురాజీవఖవాండభాండకలనాభాస్వద్విరాడ్వైఖరిన్
బహుశాఖామృగకోటిలో హనుమ చూపట్టెం గవుల్ భారముల్
బహువారంబులు మెచ్చ లోకపతి లీలన్ మెచ్చుటల్ సాటిగన్. 176

మ. ప్రతిరోమంబున భూధరప్రతతులన్ బంధించి ఝంఝాసమీ
రతిరస్కారమహాత్వరన్ నలునిఁ జేరన్ వచ్చునే హెచ్చుప
ర్వతపుందొంతులు పువ్వుబంతులో కా మార్పం గొప్పగా నంచు దే
వత లీక్షింతురు వాయుజుండు గిరులన్ వారాశిఁ గట్టింపఁగన్. 177

వ. వెండియు నఖండగండోపలప్రకాండంబు లొంటి నంటి గెంటి నప్పడుపాడము
చప్పుడు గొప్పయుఱుములచొప్పున గుప్పుగుప్పునం బడుపిడుగులవడిం బెడగడరు
రవళిం దవులనవులనవులగుహాకుమారశయాళుబిలేశయచయంబులు భయంపడి వెడలి
తడంబడునెడలఁ గదలుకొను మినుకుమినుకుమనుగనగననిమణులఘృణులపెంపుశంప
లసొం పలరింప లలితఝురీపరంపర జలసంపాతసంపద నింప నిలింపపతివారువంబుల
తీరుల మెండుకొనుబలుకొండలఖండంబులు తండోపతండంబులుగాఁ దెచ్చుచు
నలున కిచ్చుచు నిదె తెచ్చెద నని వాక్రుచ్చుచుఁ దరువులబరువునఁ బొరలక పరు
వునఁ బఱతెంచుకపులమెచ్చుచు నెదురు వచ్చుచుఁ గౌఁగిటఁ గ్రుచ్చుచు దిట్ట
తనంబునం బట్టి బలుగట్టు లట్టిట్టు పట్టి బిట్టెడలించుపట్టున బెట్టులికి చిత్తంబున
నెత్తినతత్తఱంబున నెత్తంబులపట్టున నెట్టినతమిం దమతమపతులతో నెత్తంబు
లాడువేడుకలు వీడి కొండెవయసువేల్పుసిబ్బెంపుగబ్బిగుబ్బెత లుబ్బునెడి యబ్బుర
పడి నిబ్బరపువెఱనొగిలినవగల దిగులునం దగులు నూరుపునెగలు బెళుకు గులు

ఖకందోగలు చిఱుచెమ్మటలు గ్రమ్మిన నెమ్మోములు చెదరినమరువెలిసొమ్ములుగుబులు ఖొనుమైతావులు కులు కెడలినమోవులు గడగడవడంకుతొడలు కదుదడంబడియెడు నడలు చెక్కులం బడుసరులు జాఱినపయ్యెదలు దాఱినపేరెదలు కొలందిగడచిన సద్దులు కొదదీఱనిసుద్దులును గలిగి యయ్యెడ నడుగు లిడంగూడక భయగూఢ వ్రీడలై ప్రౌఢాంగనలు క్రీడల గాఢాలింగనంబునం బొరసినసరససుఖరసలహరి రహిం గని యహిసురఖచరవరు లహితహాలాహలకోలాహలుం డగుతనుం గని కొనియాడినం గనికరంబునం బయలుపడ కుండుదురె పొండని కొండదిగునంత వడి యూరక వసియించుచు వియచ్చరు లిచ్చుమచ్చికదీవన లాలించుచు వారి నుపలాలించుచు గొప్పకొండ లుప్పరం బొరయ మీటుచు మీటి మీఁదికిం దాఁటుచు దాఁటి వాటీనికరంబులో మాటుచు వింటి నంటినతెఱగంటిదొరలకుం జాటుచు నుదగ్రభుజార్గళనిరర్గళబలోదగ్రపలాశనప్రాణానిలగ్రసనవ్యసన శ్వస నోల్లసనజాగ్రల్లామాగ్రలోమగ్రంథిత వసుంధరాధరవారంబులు బహువారంబు లకు భారంబులుగా దూరంబు లరుగ నెఱుంగనికపులయెదుర నిడి సనుచుం దరు లు గిరులు గలదెసలు గనుచు నెట్టిగట్టు నైన నునాయాసంబునం గొనుచు బలు త్రిప్పట నెప్పటిచొప్పు దప్పి దప్పి గ్రమ్మి పడినయడవిద్రిమ్మరుల రమ్మని నిజభుజ శిరః కర కక్ష వక్షస్కంధాద్యవయవసంధుల సంధించిన ధరాధరవితానంబులం గల కొనలకానలఫలంబులుం జల్లనిదొనలజలంబులు నిరూపించి యక్కడి కెక్కించుకొన నక్కపికోటు లక్కడక్కడం గ్రిక్కిఱిసినతరువుల కెక్కి మిక్కిలియగు తేనియలం జొక్కి ఫలంబులు మెక్కి బడలికలుదక్కి పెక్కుభంగులం దనమక్కువం బేర్కొని కడలిచక్కి నొక్కండునుం జిక్కక కొండలు డిగ్గనుఱికి యూరకచనక చన శంకిం చిన వలసినగిరుల లంకించికొనుండని తాం దెచ్చినవి యొసంగుచు నాకసం బగలిం చుఢాక నెసంగుచు బహుమహీభృన్నివహంబులు మస్తంబున దొంతులిడి హస్తం బునం బట్టకయే విద్దెంబు చూపుకోపున భూపతుల మెప్పించుచు మునిదేవవిహార యోగ్యవనపర్వతాదులం దప్పించుచుం బక్కినవి భారవహుల కొప్పించుచుం బుడమినలుగడలు చలింప దెప్పరంబుగం గుప్పించుచుం గప్పుజిగి యొప్పు గప్పి కొనుమలలశృంగంబులు హాటకకుధరకూటంబులు శ్వేతగిరిశిఖరంబులు దెచ్చుతఱి నవ్వేలుంగులు మువ్వేలుంగుల కనుంగగు టెఱింగించుతెఱం గవధరింపుచు వివిధ వినోదంబులం జరించుచు బహుగోత్రోద్ధరణనిపుణుండై మహారాజుతేజంబున భ్రాజితాగమశాఖాకరుండై ద్విజేంద్రుచందంబున రామాలింగితాంగుండై భుజంగు రంగున నమందసంచరణాంచితుండై ఖత్మంభరి తెఱంగున దీర్ఘతరశృంగసంగతుండై

భాగ్యవంతుఁ డంతన హరిబలసమన్వితుండై యాఖండలు డెందున నదీనపథావలోకి
తుండై యభిమానిప్రాణిక సమవిషమవృత్తప్రస్తరోద్ధరణచణుండై సుకవిహావణికఁ
గామప్రచారానుసారియై సోమునోమున నక్కపిచక్రవర్తి యెక్కుడఁ జూచినం
దానయై కపిబలంబునకు బలంబుం బ్రాపునుం జూపుచు సకలసుకృతహేతు వగు
సేతువు నలునిచేతం గట్టించె నట్టియెడ. 178

శా. అక్షద్వేషణుఁ డీవిధంబునఁ ద్రిలోకాశ్చర్యధుర్యక్రియా
దక్షుం డయ్యె హరిత్వముం దనకు సార్థంబయ్యె నా రామచం
ద్రక్షోణీంద్రు నిమేషఁ బూని సురగోత్రస్వామిపై వాసరా
ధ్యక్షుం డుండుట గానుపఁ జనియెన్ దైత్యేంద్రు బల్ పీటిపై. 179

శా. ఆమీఁదన్ నిజవంశజుల్ ధృతి ఘన ప్రాప్తేచ్ఛ నీక్షింప సం
గ్రామక్ష్మాతలమర్ద నుగ్రతరగర్జం గోయుధాస్త్రాక్షర
క్షోమేషంబునడంచి తద్రుధిర మచ్చోఁ గాల్వలై పాఱఁగా
రామోర్వీవరశేవధిం గనియె శౌర్యశ్రీ నతం డుబ్బుచున్. 180

ఉ. శోణితపంకిలక్షితి కుసుంభరసార్ద్రవితర్దిగా నిజా
క్షీణమహోగ్నిసాక్షి బుధశేఖరు లుత్సవ మొంప నభ్రకం
ఖాణముఖప్రకంపను నకంపను నాకఁడు మిత్తితోడఁ గ
ల్యాణ మొనర్చె వానిబలప్రాణములుం గవలై ప్రవర్తిలన్. 181

చ. శివశరఘాతహాస్త్రముల భేదిలి నిల్చుటకప్పరేతరా
ట్సనము విస్మృతించెఁ దయఁ జయ్యనఁ బొమ్మని వక్త్రకంపు బి
ట్టదలిచి గోమ్ము ముష్టిహతి నట్టెపగిల్చిన వజ్రదంతికో
మ్మదటున నూడి నేలఁబడె నాసరణిన్ ధృతిలక్ష్మి వెల్వడన్. 182

మ. రణరంగావని రాముతమ్ము రజతగ్రావప్రకంపక్రియో
ల్బణదోశ్శక్తిఁ బెమల్పుఁజాలమిఁ బ్రతాపశ్రీరహిన్ దానవా
గ్రణివక్త్రమ్ముల రక్తధార వెడలంగాఁ గ్రుస్సి కొంపోయె నా
ఫణిరాజాంశజుస్వామి చెంతకు మరుద్బాలత్వమున్ జెందియున్. 183

మ. దనుజాధీశ్వరువీక్షణాశలకుఁ జెందన్ దుశ్శకంబైన కాం
చనసూనచ్ఛవి మించుచంచలత గాంచం బోనిక్రొమ్మించుపైఁ
గనికించెన్ ఘనమంచు చెంచఁగను సంగ్రామంబునన్ రామచం
ద్రునిఁ దాల్చెన్ విమతార్తిఁ జెల్వుప్రతిభానుశ్రీ నతం డొప్పఁగన్. 184

మ. వివిధప్రాణినికాయకంఠకుహరావిర్భూతరక్తారుణ
చ్ఛవిలీలం బెనుమంట లద్రిచరహృత్సంప్రాప్తధైర్యాటవిన్
దవులన్ దైత్యవరానుజాతకరముక్తంబై రమాకాంతుపైఁ
గవియన్ శూలము మట్టువెట్టె నగదంకారత్వమం జేర్పడన్. 185

మ. నలనీలాదిబలీముఖాస్యబిససూనంబుల్ శరోదారధా
రల దాఁకన్ ఘనలీలగాఢతమ మూరం జేయ గ్రీష్మార్కని
స్తులతేజస్స్థితి మించి కాలుకడ కచ్చోఁబంపె దేవాంతకున్
విలసద్దేవముదశ్రువర్షములప్రావృడ్వేళ రాఁ గ్రమ్మఱన్. 186

మ. దశకంఠాపయశంబు గన్పడుగతిన్ దైత్యాంగనాత్మవ్య
థావశతాలోకనకజ్జలంబు లమరీవక్షోజకస్తూరికా
విశదచ్ఛాయ నెసంగ ఘట్టితరథోద్వేలార్భటుల్ బెట్టుగాఁ
ద్రిశిరుం జంపె జముండు తల్పుగడియల్ దియ్యం దదాకర్ణనన్. 187

చ. ఖచరతఁ జెందియుం దశముఖప్రియసూతి యసీతిమై పలా
శిచరుల నాశుగాశనులఁ జిక్కులఁ బెట్టి మదాత్మజార్థమై
యిచట వసించి రిట్టియెడ రిందఱ కడ్డము చెందుటర్హ మం
చచట వసించెనాఁ దనువులందు పరాగము గ్రమ్మ వ్రాలినన్. 188

ఉ. బంధువు లీగతిం బడినపాటుగనుంగొని ప్రేమనవ్విప
ద్బాంధవుఁ డచ్చభల్లపతిపంపున నప్పుడె హృజ్జనంబునన్
సింధువు లెల్లఁ దాఁటి గిరిఁజేరి ధృతిన్ సరిఁబోలవచ్చుగ
ర్వాంధత మాన్చి తెచ్చి కృపనందులమందుల లేపెనందఱన్. 189

మ. బవరం బుత్సవ మస్త్రముల్ తృణము లాపన్నాసురక్షాతిలో
లవిహారంబు స్వభావ మంబుధులు కాల్వల్ దుర్ధరోదగ్రశై
లవరోత్పాటనపాటవంబు లవలీలల్ మానసోద్యన్మరు
జ్జవసంచారము లంతియానము గణించన్ శక్యమే మారుతిన్. 190

చ. నగచరసాలజాలము కనత్పరిఘాయుధహస్తవృత్తి ను
గ్గుగ సమరాటవిం దగునికుంభమదేభము నొంచి పంచవ
క్త్రగరిమ చూపియుం బిదప దైత్యచమూకదళీవనంబులోఁ
దగిలినవేళ యూథపవిధంబు యథార్థము చేసె నెంతయున్. 191

చ. ఘనగతి నిల్చి పోరుదశకంఠకుమారుఁడు క్రింద క్రిందఁబా
యనిభుజగాంశ మొంద నతఁ డంబర మందఁగఁ జేసె నెంతవాఁ

డని సుర లెంచ నూర్ధ్వమునఁ దప్పరుఁ డేయుశరాళి హుంకృతిన్
జన జయ మిచ్చె రామనృపచంద్రునితమ్మునిఁ బూని పోరునన్. 192

ఉ. సూనుని పాటెఱింగి సురసూదనశేఖరుఁ డల్కశక్తి రా
మానుజు మూర్ఛ ముంచ నృపుడాఁ డార్తిఁ గనుంగొని వానరాళికిన్
బ్రాణములిచ్చిన ట్లతిరయంబునఁ దమ్మునిప్రాణ మిచ్చినా
ప్రాణము నిల్పవే ఘనకృపావని! పావని! యంచుఁ బల్కినన్. 193

సీ. శివునిచేఁ దలఁకఁ బొసియు మానిపోనిపద్మోద్భవుం డిఁక నాయు వొల్లఁడేని
యస్తమించియు నట్టె యడఁగనిరవి పునస్సంచార మెనయఁ గాంక్షించఁడేని
బడబాగ్నిచేఁ గ్రోలఁబడియు నింకనివార్ధి గాంభీర్యము వహింపఁ గడఁగఁడేని
ధనువయ్యు వంకచెందనికుందనపుగట్టు భూభారము భరింపఁ బూనఁడేని

తే. మనసుమిత్రాత్మజుఁడు మూర్ఛ మునిఁగి మరల, లేవకుండెడు నింతేల సేవకునకుఁ
గలబలోద్వృత్తి మీ రెఱుంగరె యటంచుఁ, బతికి నతి చేసి ద్రోణాద్రి కతఁడుగదలె.

క. దేహద్యుతు లెల్లెడలఁ ద, మోహృతి ఘటియింప వేల్పుమూఁకలు పరమో
త్సాహము గన విసినాచల, వాహిన్యంబుధులు గనుచు వడిఁ జనువేళన్. 195

మ. అమరుల్ దైవపనప్రసూన సురభివ్యాసంగభృంగాంగనా
వళి నెత్తావులఁ బిల్వఁ బక్వఫలదివ్యత్కాంతి బాలార్కతోఁ
దులదూఁగన్ శుకశారికాదివిహగస్తోమధ్వనిన్ బైలు మా
ర్వలుకన్ గృత్రిమతాపసాశ్రమము తత్ప్రాంతంబునం దోఁచినన్. 196

క. మున్నదతు నెన్నఁడున్ గన, నిన్నదు తెరువున వనం బిదెక్కడి తెరువో
యిన్నేల నటలు? లేఁడే, యిన్నేల జటిందుఁ డడిగి. యేఁగెద ననుచున్. 197

ఉ. అల్లన డిగ్గి యగ్గిరిచరాగ్రణి మొగ్గల నగ్గలించుబల్
మల్లెలవల్లులం బెరయుమావులతావులతావు లెల్లెడన్
జల్లుచుఁ జల్లగాడ్పొలయుచక్కి వసించి సమాధినిష్ఠమై
నుల్లము నిల్పికొన్నమునియుంబలె నున్నయొకండు గన్పడన్. 198

ఉ. నిక్కముమౌనిగా వగచి నెక్కొనుదాహము దక్క మంచిసీ
రిక్కడఁ గల్గదే? యన వహించినకైతవనిష్ఠ దెచ్చుకో
ల్మక్కువఁ బెక్కువాక్కుల విలంబము చేసి పొసంగ కున్నచో
నక్కుటిలుం డొకానొకజలాశయ మక్కడిచక్కిఁ జూపినన్. 199

## మకరీశాపవిమోచనము.

మ. అమరీరత్నము శాపయుక్తి మకరిత్వావాప్తిఁ జెందం బదం
గములక్కామిని ప్రాని యొండుకడ కేఁగన్ లేక తత్పూర్వవే
షముఁ బ్రాపించఁ దలంచి వచ్చినదొ! నాఁ జక్రాంగచక్రాళిసీ
కుముదాబ్జాదులఁ బొంకమై తగుకొలంకుం గాంచి తోయస్పృహన్. 200

మ. పదశోణాంబుజదీప్తిహీరమణిసోపానాళిఁ బ్రాఁగెంపుసం
పదనింపన్ నునునాఁచుఁబాసి చనఁ బైఁపైఁద్రోచి నాడీప్రభే
దదశన్ లోనమృతంబు గాంచుయతిచందం బొప్ప నెత్తావిఁ జొ
క్కి దృగబ్జంబులు తత్సరోబ్జములమాడ్కిం బూన సీరానఁగన్. 201

ఉ. ఆనినదంబు మోక్షవివశాత్ముఁడు పక్షిణకర్ణదీర్ఘఘుం
టానినదంబురీతి విని నానెగు లింక హరింపవే దయా
ధీన యటంచు జక్కవలదీనరవంబునఁ జెల్వి మ్రొక్కఁగా
బూనెనొ! నాఁగ నక్రి కపిపుంగవుపాదము పట్టెఁ బట్టినన్. 202

శా. ఏభాగ్యంబు ద్విజత్వ మొంది పరహింసేచ్ఛాచరత్సత్వలీ
లాభివ్యాప్తి వహించు టంచు గడద్రోయం బోలునాదంతరే
ఖాభంగం బొనరించి తద్రహితభాగం బొందవేలా? రస
జ్ఞాభిఖ్యం దగునీకు నన్కరణి జిహ్వానాడియున్ త్రెంచినన్. 203

చ. అడఁగఁగ మ్రింగఁబూన నసహ్యదవకీలలతాగృహంబులో
నడరెడులీలఁ బజ్జరమట్టెసొరన్ దన కెల్లఁ బక్కఁబో
యెడుకడి గాదు నా కనఁగ నెమ్ములు ప్రేవులతం దగల్చ బె
గ్గడిలి భరింపరానివెత గ్రమ్మినతోన విషంబు ద్రావినన్. 204

ఉ. తొట్టిననీటి కడ్డముగ ద్రొబ్బినప్రేవులముద్దమట్టిచేఁ
బెట్టినపొట్టివేలుపుగఁ బెన్గడుపన్ ఖురళిన్ క్షుధాఖ్యకున్
బట్టగుజెట్టిగొట్టి మయిఁ బాటిలునెత్తురుచెమ్మమట్టితో
నట్టె కడిందిజెట్టివలె నాతఁడు వేల్వడ నక్రి యంతలోన్. 205

సీ. సరిప్రొద్దుకడ నెట్లు మెఱుఁగెక్కెఁ బరిపూర్ణచంద్రబింబముతోడ సారసములు
ఘన మెందుఁ గన మెట్లుగనుపట్టె శిఖిపించకలనతో మీఱుక్రొక్కారుమెఱుఁగు?
పండువెన్నెల గాయుపట్ల నెట్లు స్రవింప కందమై చందురాలతిశయించె?
నరుణకాంతివిలాస మలవొందునెలవందు నడఁగ కెట్లు రహించె నుడుగణంబు?

తే. లని మహాద్భుతగతి మించ నర్హమైన, మొగము కన్నులు కొప్పు మై నగవు చెక్కు
లడుగులు నఖంబు లఖిలమోహనత నినుప, నమ్మకరియప్పుడొకముద్దుగుమ్మ యయ్యె.

చ. అమితదినంబు లాసరసియందె వసించుటఁ జేసి తద్విలా
సము లెఱుఁగితినో యనఁగఁ జక్కవచన్నులు కల్వకన్నులున్
భ్రమరశిరోరుహంబులు తరంగవళుల్ బిసబాహు లొప్పఁగాఁ
గొమిరె చెలంగె రాహుముఖగోళము వాసినచంద్రరేఖ నాన్. 207

సీ. అరజాఱుపయ్యంటచెరఁగు వెన్కకుఁ దీసి బిగియ ముంగటిమీఁద బెరయఁ జెక్కి
కరకంకణశ్రేణి కదియ ముత్తెపుఁగుట్టుఱవిక కై ముంజేతికవల ద్రొబ్బి
యలిక మంటెడుముంగురులకెంపుబుగడలు చెవిచాయకడకొనఁ దవుల దువ్వి
మొదటిరూపముగన్నముపెంపు చెలువంపుగరువతనంబు మార్ధ్యమున మాటి

తే. యడుగులట మెట్టకెందమ్ము లదరఁ జేయ, నొయ్యనొయ్యన వచ్చి యయ్యాపాద
ములు నిరీక్షోత్పలములఁబూజలు ఘటించి, కరములు మొగిడ్చివినయోక్తిఁగ లికెవలికె.

మ. జయ సంసారమహాంధకారతరణీ! సౌవర్ణభూభృద్ధృణీ!
జయ నానాగమతత్త్వభవ్యసరణీ! సద్భక్తచింతామణీ!
జయ దుష్టాసురజీవమారుతఫణీ! చంచత్ప్రితాపారణీ!
జయ సాధూత్తమచిత్తవారణసృణీ! శాఖామృగగ్రామణీ! 209

కందగర్భితశార్దూలవిక్రీడితము.—
సీ తే మ్రొక్కెదఁ బ్రోవు మున్నతకృపానిర్మాణదివ్యత్కటా
క్షా! కాకుత్స్థకులాగ్రగణ్యకరుణాకల్పా! యనల్పవ్రతా!
పాకారిప్రముఖస్తుతప్రతిభ! దుర్భావాక్షశిక్షైకద
క్షా! శోకాప్తరుచిప్రకార! గుణనిస్తారా! సమీరాత్మజా! 210

ఉ. ఎవ్వఁడు వార్ధితోడఁ బరియించె భవాంబుధి రామముద్రతో
నెవ్వఁడు యోగముద్ర ధరియించె నిశాచరరాట్పురంబుతో
నెవ్వడు కొంచెపుంబురి దహించి రహించె యశోవిభూతిచే
నవ్విబుధాగ్రగణ్యు నిను నార్తశరణ్యు భజింతు పావనీ! 211

చ. జడగతిఁ గ్రొగ్గి పంకమున సగ్గి దరాతిశయస్థితిన్ బ్రియం
బడి వడిసుళ్లఁ బెల్లడరి భంగము వాయక యింతకాల మేఁ
బడినయవస్థ నీకరుణఁ బాసి నిమేషములో నిజాకృతిం
బడసితి నీవిచిత్రమహిమం బిఁక నే మని నే నుతించెదన్. 212

మ. అమృతోత్పాదికి సీరు చూపునటు లయ్యా! సీకు నే నొక్కకా
ర్యము సూచించెదఁ గాలనేమి కుహనాఖ్యానస్థుఁ డై దుష్టస
త్త్వముతోఁ దానును బోనియీసరసిఁ జెంపం జేసి మి మ్మిట్టిక
ష్టమతిం గెల్చి ప్రయాణమందుఁ దన నత్యద్వేషణుం డి ట్లనున్. 213

క. కరివైరిమధ్య! సీవు ము,కరివైఖరి మొదటఁ బోలిచి క్రమ్మఱ బింబా
ధర వై గనిపించుట క,చ్చెరువయ్యెడు నొడువు మనినఁ జెలియిట్లనియెన్. 214

ధాన్యమాలి తనశాపవృత్తాంతమును హనుమంతునకుఁ జెప్పుట.

మ. కరుణాసాగర! నాయుదంత మరయంగా వింటె రంభోర్వశీ
హరిణీముఖ్యసురాంగనల్ చెలులుగా యజ్వల్ మహాఘోరసం
గరముక్తాంగులు మేటికాముకులు గా గానాదివిద్యాసము
త్కరసంచాలిని ధాన్యమాలిని యనంగా మించుదివ్యాంగనన్. 215

క. కైలాసంబునఁ గంతే,కాలుం డొకనాఁడు ప్రమథగణములతోఁ దే
రోలగ మున్నెడ నేనా, మేళముతో నేఁగి మ్రొక్కి మృదునియనుజ్ఞన్. 216

సీ. కామసింహము గెల్వఁగల బిరు దనఁగ సింగపుతలాటపుసిలికానె యొసఁగ
నడలభ్యసింపఁ జేరెడునంచకదఁబోలి యిరువంక ధవళచామరము లొలయ
నలకరేఖకుఁ బోల కళుకుక్రొన్నెలలీల నెలవంకబావిలీ చలనమంద
సంగముల్ లోకమోహనము లంచు గణించుగరిమ శబ్దకళాసికలు చెలంగ
తే. హొయలు కప్రముసిరములయొఱపుతిరుపు
లాగు మైసరిబెళుకుపల్లటియుఁ గులుక
జక్కణి నటించి నను మెచ్చి శంభుఁ డిచ్చె
మానితవిమాన మొక్కటి వానరేంద్ర! 217

ఆ. ఆవిమాన మెక్కి కేవి మానక మేని
తావులన్నిదిశల నావరింప
సుచితగతుల మెలఁగు చొక్కనాఁ డీజలా
శయమునందుఁ గేళి సలుపువేళ. 218

క. రెండునయనములు మొగిచి ప్ర,చండతపోనిష్ఠ నుండుశాండిల్యముసీం
ద్రుండు జలరవము వనచెవి, నిండినఁ గను జెఱచి చూచి నివ్వెఱ దవులన్. 219

సీ. చరణముల్ గన రక్తి సంధిల్లెఁ బ్రపదంబు లింతగాంచినఁ గ్రియ లెల్ల మణిఁగె
జంఘ లన్వేషింప శరధినిమ్నత మానె మిహి తొడల్ చూడ లో మెత్తవడియెఁ

బిఱుఁదు గన్గొన్న నిబ్బరపుటబ్బుర మబ్బెఁ గాను చూచినఁ దాల్మి లేనిదయ్యె
నాభి వీక్షింప వెంపపుఁదమ్మి సుడివడె నార రసిన హరిధ్యాన ముడిఁగె
తే. వలిచనుంగవ దృష్టింప బలిసె మేలు
మొగము దర్శింపఁ గళ రేఁగె సొగసుకప్పుఁ
గొప్పుఁ జిలకింప బలుతమి గప్పుకొనియె
జటిలచక్రేశ్వరునకు నాశ్చర్యముగను. 220
ఉ. చూచినచూపు ద్రిప్పుకొను-బొ ప్పతఁ డప్పుడు గానకున్నచో
నా చిగురాకుబాకుతురకాయన కో యని యార్చి జాజినే
జాచెయిఁ బూచి వైచె మునిచంద్రుచిత్తము వ్రయ్య నంతలో
రాచిలుకల్ రొదల్ సలుపరాయిడి తెమ్మెరదొమ్మి గ్రమ్మినన్. 221
తే. జపతపంబులు చాలించి శాంతి డించి
తమకమున లేచి యడుగులు తడఁబడంగ
వడి నిగుడ మేను పులకింప వచ్చినిలిచి
పలికెఁ బలుకుల నునుఁదొట్రుపాటు గదుర. 222
మ. అడుగుల్ కెంజిగిరుంగుమంబు ధర కియ్యన్ మేను బై తెల్లఁ బు
త్తడిసేయన్ నునుచూపు లెల్లెడల నిద్దాకల్వపూమేలుక
ట్లదరింపన్ నడయాడుమించువలె నొయ్యారంపులేఁబ్రాయపుం
బడుచా! మించుఁ జరించఁ గాంచి భరియింపంజాల మన్నింపవే! 223
ఉ. నీముఖపూర్ణచంద్రకళ నిండిన మోహతమంబు గ్రమ్మె నీ
మైమెఱుఁ గావరింప నియమంపుమయూరము చిక్కె నీవళీ
స్తోమతరంగముల్ వెలయఁ దోరపుఁ గాఁక జనించె నీదృగ
బ్జామితలీలచే ధృతిమదాళి చలించె నిదేమొ? కోమలీ! 224
చ. ఎలనగ వంకురింప మొగ మెత్తి కనుంగొనరాదొ మేనఁ గ్రొం
బులక లెసంగఁ బై నొరఁగి పొంకపుఁ జన్మొన లుచ్చిపాఱఁ గౌఁ
గిలి దయసేయరాదొ విడికెంపులకెంపు నడంపుమోవి తే
నెల వడి దేర్పరాదొ దమి నిల్పఁగరాదొ వధూటి! నాయెడన్. 225
క. ఇప్పుడొకమాట చెప్పవె, తప్పక యోయొప్పులాఁడి తప్పనొడువులన్
నొప్పించెదొ నీమది రతి, కొప్పించెదొ నన్ను మరున కొప్పించెదవో. 226
క. అని తనఘనవర్తనమున, కనుచిత మగుపలుకు పలుకునమ్మునిమూర్ఖ
న్యుని గనుఁగొని వినయము నయ, మెనయ నిజం' భావహిల్ల నే నిటులంటిన్. 227

తే. అమ్మ నేఁ జెల్ల మునినాథ మిమ్ముఁబంటి
పెద్దలకు నింతవలవంత పెరిమ యగునె?
యల్పసుఖ మింతె యింత లేదనక యింత
పొలుమాలినఁ దప మెల్లఁ దూలిపోదె? 228

శా. అంతర్నాదసుఖంబుకంటె ఘనమే? యయ్యో! రటత్కంకణా
క్రాంతక్వాణధురీణనూపురమణీకాంచీగవప్రస్ఫుర
త్కాంతాకంతురణోజ్జ్వలక్వణిత మాకర్ణింప నేలయ్య? వి
భ్రాంతిం జెందెద రింతమాత్రకె మునీంద్రా! యన్న నాతం డనున్. 229

సీ. సుదతి! నీనెమ్మోము చూచినంతనె కల్గె ద్విజరాజదర్శనోద్వేలఫలము
కలికి! నీచిఱునవ్వు గనినయంత ఘటిల్లెఁ జంద్రికావిభవవీక్షాఫలంబు
వనిత! నీమోవి గాంచినయంత జేకూరె నరుణబింబాలోకనాప్తిఫలము
చెలువ! నీకంఠ మీక్షించినంతఁ బొసంగెఁ బరమశంఖనిరీక్షఁ బ్రబలుఫలము
తే. అతివ! నీయూరు దర్శించినంత దొరకె నీలవర్ణవిలోకననిర్నిద్రఫలము
తరుణి! మఱియింతకంటెను దపము చేసి, యేను బ్రాపింపఁగలఫలంబేమి చెపుమ? 230

క. వాతెఱ ఫలంబు చెక్కులు, నాతిరో! లవలీదళములు నాభి సర మురో
జాతములు గిరులునై తగ, నేతెఱఁగున దపసి వదలు నిన్నియుఁ గనియున్. 231

ఉ. అట్టిటు మాటలాడి విరహాంబుధి ముంచక నన్ను నీదుచ
న్గట్టులఁ జేర్చుకొమ్మనుచు గ్రక్కునఁ బైఁబడి రా జటీంద్ర! హా!
ముట్టకు మే రజస్వలను మూఁడుదినంబులదాఁకఁ దాళుకో
మెట్టులనైన మీఁద ఘటియించెద నీపదసేవ నావుడున్. 232

క. మొగ మింతై వగ వింతై, తగవు దలఁచి నిలిచి యెటులు దమినిలుపుదునే?
మగువా! మూఁడుదినంబులు, దగవా? ఖగవాహసుతుని ఘాటికిఁ ద్రోయన్. 233

చ. అలరుకటారిమన్నెదొరయాయుధశాల సమీర మల్లసం
కులఖురళీస్థలంబు మదకోకిలషట్పదరాజకీరమం
డలి బెడిదంపుఁబ్రోఁతలకొటారు వనం బెటులొంటి నిల్వఁగాఁ
గలఁ డొకబ్రాహ్మణుం డనక కామిని! యేమని పాసిపోయెదే? 234

ఉ. నీరహిఁ బల్కుచిల్కలకు నీనునుఁగొప్పున నొప్పు తేటికిన్
నీరుచిరాంగవాసనల నెక్కొనుగాలికిఁ గొంతయోర్చెద
న్వేరెవరాకుగాక తరుణీ దివసత్రయి సన్నఁ దానమై
మేర దలంచి రాఁ దగుసుమీ యని యమ్ముని యొట్టకేలకున్. 235

తే. ఒప్పుకొని పల్కుటయు జెప్పి యొకవిధమున, నవలి కేఁగిన నతని మోహంపుఁగోర్కి
కియ్యకొని వచ్చుదాననై యేచు గంధ, మాదనాద్రికేఁ జనియున్న మాని యచట. 236
మ. మరుక్రూరాస్త్రభయార్తిఁ గుంజము సొరన్ మత్తాళి మల్లాతిదు
స్తరహల్లోహలశబ్దముం దదర సంతాపించి చూతంబు డా
య రటత్కోకిలపఙ్క్తి లాడ వెత సేయన్ నిల్వశంకించి వెం
బఱవిత్తై నలువంకలన్ ముని స్మరాపస్మారలోలాత్ముఁడై. 237
మ. అనలన్ షట్పదఝంకృతుల్ దొరయునో యన్ భీతి నంతర్నద
శ్రవణం బొల్లఁడు వెన్నెలల్ వెలయు నన్ శంకన్ స్వనాసాగ్రదృ
ష్టి విరాజిల్లఁడు చంద్రుపై కసఁగు నన్ చింతాస్థితిన్ రాజయో
గవిధం బూనఁడు గాడ్పుఁ బట్టఁడు మదాకారంబె చింతించుచున్. 238
ఉ. చందనగంధవాహశిశుసంచలదంచితచూతపల్లవా
గ్రిం దగుకోకిలం బరొద చిట్టదరన్ దనుఁ బిల్చెనో యటం
చందుల కేఁగి చూచి మఱుఁ డందె వెసన్ జరిపించువాలురీ
తిం దిలకించి హా గుణవతీ! యిఁక నెప్పుడు పిల్తువే యనున్. 239
ఉ. కొప్పొక చేతఁ బట్టి తళుకున్ నునుఁజెక్కిలి నొక్కి తేనియల్
చిప్పిలుమోవి పంటఁ దగిలించుక సీత్కృతి నింపఁ గెంపులం
గప్పి కవుంగిలించుకొనుగాఢత మున్నగ నీవి వీడగా
ముప్పిరిగొన్న మోహమున ముద్దియఁ గూడి సుఖించు టెన్నఁడో. 240
క. అని పలికినదే పలుకుచుఁ, జనినయెడకె చనుచుఁ గనినచక్కియె గనుచున్
దినములు మూఁడెటువలెఁ జను, ననువనటన్ మాని దలఁక నమ్మొదటినిశన్. 241

## చంద్రోదయవర్ణనము.

సీ. నిశ చకోరద్విజనికరంబునకు నిడ్డ కెంపుటక్షతలపొన్నిన్నె యనఁగ
సమయబాలుఁడు వైవ నమరు క్రొంబచ్చెనఁ గడు హెచ్చుగొడుగుబొంగర మనంగ
గగనవాణీవధూకంఠభాగంబునఁ బొలుపుమీఱిన తాలిబొట్టనంగ
హరశిరోరుహసంగ యగుగంగలో నొప్పుకమపీయనవ్యకోకనద మనఁగ
తే. జంద్రుఁ డుదయించ వెన్నెలల్ జగతిమించ, నప్పు డప్పర్వతంబుపై నలరుతావి
బుగులుకొనునొక్కపచ్చరాజగతి నుండి, తాయిగా నేను గానంబు సేయువేళ. 242
ఉ. అచ్చటి కేఁగుదెంచినవశానను డంతయు నాలకించి యే
యచ్చరమచ్చెకంటియొ గదా! యని మెచ్చి మదగ్రభూమికిన్

నచ్చి జగత్త్రయిన్ గెలిచి వచ్చిననన్ విరివిల్తుఁ డమ్ములన్
గ్రుచ్చి జయించె నింకఁ గయికొమ్మని సెట్టనఁ జెట్ట వట్టినన్. 243

తే. దీనమానస నై పరాధీన నగుటఁ, యువు రజస్వల ననియును నాతనికిఁ దెలుప
వేశ్య కెక్కడిపరపంత్ర ప్రవృత్తిని యనియును, గాక పుష్పిణి నగుటసౌఖ్యంబె యనుచు.

చ. బలిమి భుజామృణాళములు పట్టి పయంట దెమల్చి గబ్బిగు
బ్బ లలమి మోవికెంజిగురు పల్లవ లంట నెవ్వజానజ్జు గాఁ
బలుమఱు నొక్కి పేరురముపై మృదులాంగముఁ జేర్చి మోహ మ
గ్గలమయి యున్కి నింగితము గాంచక మించి రమించి నొందినన్. 245

తే. అంతలోపల నతికాయుఁ డనుకుమారుఁ
డుదయ మొందిన సుతుఁ గొంచు ముదముఁ జెంది
యతఁడు సనియెఁ ద్రిరాత్రంబు లైన దాన
మేను గావించి మునిఁ జేర సేఁగు దేర. 246

ఉ. వాఁడినమేను నజ్జడనవాతెఱయున్ గడువిన్నఁబాటుతోఁ
గూడినసెమ్మొగమ్ము వదన న్నడ లంతకు మున్న తెల్పనా
జాడ యెఱింగి నెమ్మదిపొసఁగక రాగము కన్నులందుఁ దో
డ్తోడ సెసంగ నజ్జటిలధూర్జటి పల్కె బదాళి గీఁటుచున్. 147

ఉ. ఏను వరించినాఁడన్న తమి యించుక గాంచక కొంచ కెంచ కె
వ్వానికి జవ్వనం బొసఁగి వచ్చితివే? యటుమాయలాడి! యే
హీనుఁడు నన్నుఁ గైకొనక యింత యకృత్యము చేసె నయ్యయో!
యేనియమంబు వేశ్యకన నేటికిఁ జేసితి? గాంచు నీయెడన్. 248

ఉ. చిత్తము వంచుటో హరి భజించుటొ బంధము లూడ్వ ధైర్యపుం
గత్తి భరించుటో నియతి గైకొని మించుటొ యాత్మఁ గాంచుటో
చిత్తజరోగముల్ వెనుచు నీ కసుమాలపుఁదోలుబొమ్మతో
హత్తుట లేమి? పొమ్మన కహమ్ములు మూఁడు వితాక్రమించితిన్. 249

తే. ఒకనితో మాటలాడి వేఱొకనిఁ గూడి
యొకనిమనసున నెంచి యొండొకని నొంచి
యెవ్వనికి మర్మమీనిమీ కెల్ల నొకలఁ
బుట్టఁగాఁ బుట్టినవిగావె యిట్టివగలు. 250

ఉ. కాయము చూత మన్న నతికష్టము నెమ్మది యన్న వక్రభా
వాయతనంబు మోహగుణ మన్నను జంచలచంచలాలతా

ప్రాయము గ్రామ్యధర్మసుఖ మన్నచొ స్వల్ప మనేకదోషనిం
దాయుత మింతె కాక కలదా? సుఖమింతులయందు దొకింతయున్. 251

శా. శీలక్ష్మాధరవజ్రధారలు పయస్సింధూజ్జ్వలద్బాడబ
జ్వాలల్ లోభమృషాభిమానమదహింసాజన్మభూముల్ వృథా
కాలక్షేపవిధాదికారణలు జాగ్రత్కీర్తిబాలానిల
వ్యాళస్త్రీలు వివేకపాకసుకృతవ్యాపారసారంగశా
ర్దూలల్ కొమ్మలు వీరినమ్ముదురె సాధుశ్రేష్ఠు లెప్పట్టునన్. 252

ఉ. కామిని! నిన్ను సాధనముగాఁ గొని కాముకకోటి గెల్చిన
క్కామునిటెక్కెపుం దెఱఁగుఁ గాంచి విచారము డించి నక్రవై
యీమెయిఁ బాసి యుండు మిల నేను వరించిననిన్ను బల్మిమైఁ
గామశరార్తిఁ గైకొనినకష్టుఁడు కామినివంకనే చెడున్. 253

ఉ. తప్పదు పొమ్మటన్నఁ బరితాపము శాపముఁ గ్రమ్మఁ గన్నులన్
జిప్పిలుశోకబాష్పములచే జడదారికిఁ బాద్య మిచ్చి యా
తప్పు ఘటిల్లె నక్కుటిలదైత్యబలాత్కృతిసంక నింక నా
యెప్పటిరూప మెప్పుడు వహింపఁగలానో వచింపరే యనన్. 254

ఉ. ఆమునిరాజు క్రమ్మఱ దయార్ద్రమతిన్ ననుఁ జూచి "సిద్ధసా
ధ్యామరయక్షకిన్నరముఖార్తికమోహహృతిక్రియామహో
ధాముఁడు వాయునందనుఁడు దాశరథిక్రియుఁ డిందు వచ్చి నీ
బాము హరించి పోవు"నని పల్కి చనెన్ వినవే గుణాంబుధీ! 255

ఉ. ఒక్కకచోఁగదా మకరికోజ్జ్వలతల్ వహియింప రెక్కడన్
జక్కరబొమ్మలా గతి పొసంగక తాపసశాపసంగతిన్
గ్రక్కునఁ గోమలాంగ మఱి కర్కశదేహము గల్గె నంతలో
నెక్కడఁ బోయెనో గుణము లే నెఱుఁగన్ మకరిత్వ మొందితిన్. 256

శా. శాండిల్యుండు గణించినట్లు తెలిసెన్ స్వామీ! భవద్విక్రమా
ఖండప్రాభవ మాఁడుదానఁ బొగడంగా నేర నేఁబోయెదం
దండం బాశ్రితరక్షణప్రవణ! మీదాసిం దయాదృష్టిఁ జూ
డుండీ యంచు విమాన మెక్కికొని వీడ్కొన్నం గపిస్వామియున్. 257

మ. తనలోఁ జేరి త్రిలోకభీకరమహాదర్పంబునం బేర్చిన
క్రిని నొక్కాడినఁ దత్సరఃకమలభృంగీనాదసంపత్తి నీ

వన గావించి ప్రఫుల్లకైరవరజోవ్యాసక్తహేవాకమో
హనమందానిలయుక్తి గంధవాడిమై కన్పింప మోదించుచున్. 258

తే. కపటముని వేషమున నున్న కాలనేమి, నపుడె వైవస్వతునిపీటి కతిథిఁ జేసి
కహకహార్భటినభ్రమార్గమున నెగసి, యతిజవంబున ద్రోణపర్వతముఁ జేరి. 259

మ. రతనంపుంజిగినించుకూటములు మీఱం జందవేదండవి
శ్రుతగంధర్వసమృద్ధి వర్ధిలఁ ద్యుతిజ్యోతిర్లతాదీపికా
తతి నల్వంకలఁ దోఁప సాను లిరవొందన్ గహ్వరన్ బొప్పఁగా
క్షితిభృత్సంజ్ఞ నిజంబు సేయుశిఖరిన్ గీర్తించె సౌమ్యస్థితిన్. 260

ఉ. ఓనగచక్రవర్తి! సుగుణోర్జితకీర్తి! జగద్ధితంబు రా
మానుజుప్రాణరక్షకుఁ ద్వదోషధముల్ గనిపింపు మన్న స
న్మాన మెఱుంగ కగ్గిరి ప్రమత్తతఁ జెందెఁ గభీరగహ్వరం
బూనెడుగట్టువాయువులు మృదూక్తిస్వభావము పూన నేర్తురే. 261

వ. ఇత్తెఱంగున మొఱపెట్టినంబున సరకుగొనని కఱకుమలం జూఱుకుచుఱుకునం
గనుంగొని. 162

చ. అదరి ధరాధురంధరుల సందఱఁ దాల్పు మహాఫణీంద్రుఁడే
పుడమి సుమిత్రపట్టి యయి పుట్టి సురద్విషదగ్రగణ్యుచేఁ
బడి యటు లున్నవాఁ డతఁడు ప్రాణము లొందఁగ మందు లిమ్మటం
చడిగిన మేల్ దలంచికొనవైతి కృతఘ్నుఁడ భూధరాధమా! 263

సీ. పలుధాతురాగదంభమున నెప్పుడుఁ గిన్కఁ జేబట్టె మోమెఱ్ఱ చేసికొనుట
పలుకూటములఁ గూడి పరవంశదహనసంపత్తి నొక్కొక్కచోటఁ బ్రబ్బికొనుట
బహుగనుల్ గొనియును దుర్భరతచే ద్విరసనప్రాప్తి నెత్తములసొం పందుకొనుట
పాదంబు సాను లెప్పటికిఁ జెందిన శృంగిమిషమున మిన్నంది మెండుకొనుట
తే. నీకు నైజంబు లివి యెల్ల నేఁ డడంతు, చూడు నన్నని పవమానసూనుఁ డదరి
చండదోర్దండలీల నక్కొండఁ బండ, చండతరుఁ జెందుచండీశుదండి నిండి. 264

స్రగ్ధర.—
పంచాస్యధ్వానశంకన్ భ్రమదకరిభుజాల్ పర్వ తెత్తం దటోర్వీం
జంచద్విద్యాధరస్త్రీజనముపతులు మెచ్చన్ మహాశ్లేషముల్ గ
ల్పించన్ దన్ బ్రోచువారిన్ బెదరి కుధరమే! కల్పనోనా గుహల్ ఘో
షించన్ గర్జించి తమ్మిం జెనయుకరిగిరిన్ శ్రీహనూమంతుఁ డంతన్. 265

చ. పదహతిఁ జిట్లిపాదములు భగ్నము లై చన మందరంబుచు
ట్టూదవినసర్పరాజు తెఱఁ గొప్పఁగ వాలము గట్టి చుట్టుఁ జు
ట్టి దిటవు వాపుటన్ గిరి కదిందివెతం గనుబాష్పవైఖరిన్
బొదలి ఝురంబు లెల్లెడలఁ బోవఁ బెకల్చి వహించి పోవఁగన్. 266

శా. గంధర్వుల్ పదుమూఁడుకోటులు మహోగ్రక్రోధరక్తాస్యులై
సింధూపదగ్రగభీరఘోషముల నాక్షేపించి యిక్కొండప గ
ర్వాంధత్వమ్మునఁ గొంచు నెం దరిగెదం చుగ్రంథవాహాత్మజుం
గంధేభంబు నెదుర్చు దోమగమిజోకన్ వీకమైఁ దాఁకినన్. 267

మ. పదివేలక్కులరూపుఁ జూపె సుప్రతాపస్ఫూర్తి వర్తిల్లఁ ద
న్నుఁ బాల మసంచుఘోరకరచండవ్యాప్తి శస్త్రాదిగా
ఘపశోద్భూతశమిస్రముల్ విరియఁ గ్రీడన్ వాల మల్లార్చి పె
ల్లపరం గొంతులఁ జుట్టి మించి కెగవేయన్ వారు భీతాత్ములై. 268

చ. తునిసిన కాలు చేతులును దోరపునెత్తురుఁ దోఁగు మేనులున్
ఘనపదతాడనంబుల దకావక లైన యుఱుంబులూని రౌ
పనచరనాథ! నిన్ దొడర వచ్చిన నేరము గాని కొంపఁ గై
కొని పను మింక దీనులము కోపము నిల్పకు మంచు మ్రొక్కినన్. 269

ఉ. ఆదరవృష్టి వారిఁ గని యక్కపిరాజు భుజాగ్రపీఠమైఁ
జామగ నిల్పి కొన్నగిరి ఘాసునిసానుతటీవిరత్నర
త్నోదితకాంతు లంధతిమిరోద్ధతి మాన్చి పదంబు సూప రా
నాపం మాల్యవంతుఁడు దశాననుపంపున కౌర్యవంతుఁ డై. 270

క. మేటినిశాటులు పదికోటులు కొలువంగఁ బరశుపంతశ్భురికా
ద్యాటీము మీటుగ నక్కపికూటమునఁ గని ఘాటి కెదిరి శూరతఁ బలికెన్. 271

శా. ఓరి వానరు! సత్వరంబు గల వం చూహించితో యిట్లుప
ల్మారన్ మందులగట్టుఁ దెచ్చి పికి నేలా పెత్తి నామునుపరన్
బోరా నిర్వరకేకపాదులకు సంభోగాశి నిక్కైలముం
బాఱన్ వైచినఁ బోవనిచ్చెదను నిన్ బ్రాణంబుతో నావుడున్. 272

శా. ఆరామక్షితినాథుబంటు నిశతోఁ గల్లార్చి యేమంటివో
రి రాత్రించర! గట్టుమా ఱిపుడు వార్ధిం దావకీయాంగమే
పాఱన్ వైచెద బంటనై నిలువు నీపాలింటికాలుండ నే
నే రా యంచుఁ బ్రదీప్తపావకశిఖల్ నేత్రంబులం జూపినన్. 273

ఉ. బింకపుమాటలాడి వెలిఁగించి పనాటులఁ బ్రాఁబలిజాలానఁ గం
డింక నిశాటులార! చనిరియ్యకఁ బట్టుఁడు గట్టుఁ డంచు ని
శ్శంకత మాల్యవంతుఁ డనఁ జక్రశరాసనముఖ్యసాధనా
లంకృతహస్తులై కపిలలామముని డాఁకె సురారు లీసునన్. 274

శా. దేహచ్ఛాయలఁ జీకటుల్ బలియ నుద్రేకించి శస్త్రాస్త్రసం
దోహంబుల్ నిబిడంబుగాఁ గురిసి రోదోభేదిదిశాకృతగ
ర్జాహుంకారము లంకురింపఁ గన లెప్పన్ గిర్యవాలంబు వే
నా హేతిప్రముఖాయుధప్రకటలు మాయం జేసి యమ్మేటియున్. 275

సీ. విమతభుజాభుజంగమగర్వవిషము మాన్చుటకుఁ బక్షిసంగత ప్రతాప మొంది
యహితోత్తమాంగశృంగాదికముల గల్పవేళ భృతాశనిలీలఁ బెలఁగి
పరసైకనాళీక బహుళశ్రీహంతలచంచు నెడ ఘనప్రబలత్వ మెఱుకపఱచి
విద్విషత్పురసముద్వేలలీలలు మాన్చుచో నుగ్రసముగ్రభాతి నాటి

తే. మూఁక నెల్లను నిశ్శేషముగ వధించి, పండె దానవమాల్యవంతుండు గినిసి
కార్ముకమునారి సారించి ఖరశరములు, ఘనము సిద్ధాంతపతి సీనుకరణిఁ గురియ. 276

ఉ. అన్నియు వాలహస్తచటులానిలశక్తి శరాఖ్య నిక్కమొం
దన్నడుమన్ సహించియు రణంబునఁ దార్క్ష్యుఁడు పాఁపతున్కఁ బోఁ
దన్నెడుచెన్నునన్ దనువుఁ దన్నిన మందులగట్టు గొన్న వి
ద్వన్నుతు గిట్టి బెట్టుగదవైవ నుదిస్ఫలి డాఁక నుగ్గుగాన్. 247

శా. చేతూలంబు వహించి వైచిన మహోత్తాశజ్వాలికాశీలమై
రాశూరాగ్రశిఖేలఁ బట్టి బిగజాలన్ ఖడ్గ మంకించి యా
కాశం బంటెనమంట నొంటిముదిరాకాసిన్ సునాసీరము
ఖ్యాశాధీశులు మెచ్చఁ బార్ష్ణిహతి జయ్యం జేసెఁ గయ్యంబునన్. 278

శా. ఆలో మూర్ఛఁ దేఱి వైరిపయిరా నక్షూరి తత్కంఠమున్
వాలాగ్రంబునఁ జుట్టి వార్ధిఁ బడవైవం గూలి దుష్కృత్తిజం
బాలంబుం బతెఁ బంకె పంగ మెనయన్ భంగంబునం దూలి పా
తాళద్వారముఁ బట్టి యట్టె సనియెన్ దర్పించువివ్వల్ నగన్. 279

శా. జేజేరాజులు పూలవానలు ప్రవర్షింపన్ మహోత్కర్షహ
ర్షాజేయుండయి యేఁగుదెంచి నిజబాహాగ్రాచలాధిత్యకా
భూజాతౌషధయుక్తి లక్ష్మణుననుస్ఫూర్తుల్ గనం జేసె న
వ్యాజేయుం దనుజప్రదాయి యని డాయం బిల్చి నెయ్యంబునన్. 280

మ. రవివంశం బనుపైరు మస్సహజమూర్ఛాకుత్సితావగ్రహా
స్తి వికాసం బజివోవ సీవు ఘనరీతిన్ ఫ్రీతిఁ బోకార్పఁ బూ
ర్వవిధిన్ వృద్ధివహించె నింకఁ బ్రతికారం బేది? నాచిత్తమే
భవదాయత్త మటంచుఁ గౌఁగిటను సంభావించి దీవించినన్. 281

ఉ. అద్రిచరాధినాథులమద భుజలంబులతో సుధాశిక
ల్పద్రుమపుష్పవర్షము లపారములై కురియన్ నిశాచరా
ఛ్ఛిద్రభుజాప్రతాపశిఖి శీతలఁ జెందఁ దదీయకీర్తిదీ
వ్యద్రుమహంస మేఁగె దివియం బనురీతిన్ విస్మయముం బొరన్. 282

సీ. పడియున్న సౌమిత్రి ప్రాణంబు క్రమ్మఱఁ బూన్ప మందులు దేరఁబూనుమైత్రి
పూని వార్ధిద్వీపభూము లన్నియుఁ దాఁటి క్షణములో గిరిఁ జేరఁ జనెడుజవము
చని మందులోనఁగూర్పు మని వేఁడినను గొండ యూకున్నఁ బెకలించి యెత్తుకడిమి
యెత్తి తద్రక్షకు లెంచఁబడ్డము సొచ్చి దురము చేసిన వారిఁ దునుము తేగువ

తే. తుసిమి తెరువున నేవిఘ్నములు బొరయక, వచ్చిబ్రతికించి యచ్చటివారిలోన
నొక్కరుండయి గమకింప కున్నమహిమ, హనుమయెడఁగాక యితరులయందుఁగలదే?

మ. సమరాక్షోణిఁ దశాండు శైలము యథాస్థానంబునం దుంచఁగాఁ
గమియింపం బరికించుఁ డంపఁ బటుసంగ్రామస్పృహన్ స్థూలజం
ఘుమహాదంష్ట్రమహోదరాద్యసురసంఘాతంబు మారొగ్గ చో
నమితాహంకృతి నవ్వె రాత్రిచరులారా! సిల్వుఁడం చుద్ధతిన్. 284

చ. శిరములు ద్రుంచి కంఠములు చించి కరంబులు ద్రుంచి శస్త్రముల్
శరములు నొంచి మించి నిమిషంబున సేన నడంచి యమ్మహో
దరముఖసైనికాగ్రణుల దక్షిణదిక్పతిఁ జూడఁ బంచి త
ద్గిరి నలచోటు డించి చనుదెంచి రఘూద్వహుఁ గాంచి రంజిలన్. 285

సీ. వానరావళికెల్ల వజ్రంపుఁగోటయై వలనొందె నెవ్వానివాలవల్లి
పరగు నెవ్వనిపెంపు పాతాళలంకేశముఖితరాఘవబంధమోక్ష మగుచు
నెల్లవేల్పులకీర్తు లీక్షింప నెవ్వానిసామర్థ్యమున శతాంశంబుఁబోల
దెవ్వానికనుదోయి కిసుమంత మశకమై కనిపించుఁ గఱకురక్కసికులంబు

తే. లట్టిజగజెట్టి గాడుపుపట్టి గట్టి
దిట్టతన మిట్టి దని మాటఁ బట్టువోలఁదు
నెట్టివారికి జెట్టు నే నెట్టు లనఁగ
నెట్టుకొనువేడ్క విని శ్రోత యిట్టు లనియె. 286

క. పాతాళలంకరాక్షసు, నాశం బట్టుపడి కొట్టు శ్రీరఘునాథున్
వాతూలసూతి యిరువుర, నాతెంచి గనుఁ గొనెఁ దెలుపన్ యని యనుమానా. 287

మ. శరసంధారణ! ధారణాప్రియమునసు ధ్యాన! సధ్యానవా
సిరమాహృద్యశ! హృద్యశర్వనుత శ్రీసాంద! శ్రీసాగనే
శ్వరతావాహన! గాహన ప్రముఖ తీవ్రత్యాగ! ప్రత్యాగ మో
క్షరబృందారక! దారకస్వక్షతరోకన్యాయ ధన్యాయనా! 288

క. సారంగహరణ మునిజన, సారంగఘనాంగ! జనకజాహృద్యవిసి
సారంగ! దశముఖాసుర, సారంగవిభంగ కావ్యకావ్యనృపేంద్రా! 289

కవిరాజవిరాజితము.—

ప్రణుతసనందన! బంధురనందన పాలకనందన నేత్రవిభా
చణ! శరపన్నగ! సాధువిపన్నగశక్ర! ప్రపన్నగణప్రమనా!
గణితవికస్వర! కంధ్యధికస్వగ! కంటకకస్వరభీశమనో
వ్రణపరిహార! కగప్రవిహారకరాతిపహార! కళాచతురా!

గద్య. ఇది శ్రీమదంజనాతనయ కరుణాకరసలసత్కటాక్షవీక్షామహత్త్వసంప్రాప్తకవిత్వవిద్యా
వధానసగుణనిర్గుణ ధ్యానవాసనా నిధానమానసవిసపుష్ప పుష్పగిర్యప్పనార్య
కుమార సమాశ్రితబుధాచారగురుజనగేయ తిమ్మననామధేయ ప్రణీతంబైన సమీర
కుమారవిజయం బనుమహాప్రబంధంబునందు గుణవర్ణనంబును రామసుగ్రీవసంధానం
బును సముద్రలంఘనంబును సీతాసందర్శనంబును రావణసంభాషణంబును రఘువీర
దర్శనంబును రామచంద్రునకు విభీషణుం డానుకూలించుటయు సేతుబంధనంబును
ధూమ్రాక్షాదిరాక్షసనిగ్రహంబును మకరశాపమోక్షణంబును లక్ష్మణప్రాణదానంబును
నన్నది తృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము.



ధర! రుచిరూపకధా
రాధర! ధరణీసుతావిరాజసుధాధా
రాధర! పరమావకధా
రాధర! ధైర్యాభిరామ! రఘుకులరామా! 1

తే. అవధరింపుము భూతదయాగరిష్ఠ
దగువసిష్ఠుం డనియె గౌతమాత్మజునకు
విను శతానంద! యక్కపివీరుఁ డవల
సంఘటించినకార్య మాశ్చర్యముగను. 2

ఉ. రావణుఁ డాంజనేయునిపరాక్రమముల్ రఘురామునౌరబా
హావళియుం దలంచి భయ మంది నిజాన్వయనాశ మెంచి చిం
తావిలుఁ డై యుం దన దుపాయము గన్గొని నాగలోకలం
కావిభుమాయదారిఁ జెలికానిఁ దలంచిన వాఁడు వచ్చినన్. 3

క. ప్రత్యాలోచితవార్తల, సత్కార మొనర్చి రామజనపతి యన కా
పత్కారి యనుట రాత్రించ,రోత్కర మిల్లుటయు నోడివి యెఱుఁగుచుఁ బలికెన్.

క. నాపయిని వానరబలం, బేపారఁగ నిన్నువంటిహితశీలుఁడు మా
యోపాయజ్ఞుఁడు గలిగియుఁ, జూపెట్టుక యుండుటయనె సువ్రత యనుచున్. 5

క. లంకేశుతోఁ రసాతల,లంకేశుఁడు మహాంతపని చలంబున నరులన్
గొంకక కొని చని నాపురి,కంకాళికి బలి యొనర్తుఁ గనుఁగొను మనుచున్. 6

ఉ. అప్పుడె వచ్చి యచ్చెడు గహంక్రియతోఁ దనప్రాణపత్నికిన్
జెప్పిన నప్పయోజముఖి జిహ్వ దడంబడఁ బ్రాణనాథ యీ
చొప్పున కొప్పి రాఁదగునె? చొప్పడునే పెఱవారిమాటలం
గప్పిన నెప్పినం జని జగత్పతి రామునిమాయఁ గప్పఁగాన్. 7

శా. సాధింపం దరమే రఘూత్తముని నప్పన్మంత్రియై భృత్యుఁడై
మేధాశాలి జగత్త్రయైకనుతగాంభీర్యుండు ఖండేందుభృ
ద్ద్వేషిముఖ్యబుధేంద్రదత్తపరవరిష్ఠప్రభావుండు సం
బోధాంభోధిమహాబ్జమిత్రుఁడు మరుత్పుత్రుండు వర్ధిల్లఁగన్. 8

క. ఆతఁడు వానరమాత్రుఁడె, యాంతరశత్రుకులజైత్రుఁ డఘటనఘటనా
స్వాతంత్ర్యశుభచరిత్రుఁడు, సీతరమా! యతనిఁదొడరి నిలువఁగఁ బోరన్. 9

సీ. కపటంపుఁబడదారిగతిఁ బూని యతనిచేఁ గడతేఱఁడే? సిన్న కాలనేమి
ప్రతిఘటింపఁగ నున్న బలుతోఁక వడి నొచ్చి సురుఁగఁడే మాల్యవత్సురవిరోధి
కామరూపము బూని గమకించి రణకేళి స్థూలజంఘాదులు దూలిపోరె?
శోంప విడు మంచుఁ జైత్రసేనాదికుల్ బవరంబులోఁ బడ్డపాటు వినమె?

తే. అక్షధూమ్రాక్షదేవాంతకాదిదుష్టదైత్యవిధ్వంసనోద్ధురాద్ధతి యెఱుఁగవె?
కనియు వినియును జిచ్చోపఁ గట్ట నేల? చుట్టములకీసు పైఁ బూని గిట్ట నేల? 10

శా. ఆధూమ్రాక్షవిరోధి బాల్యమున బాలార్కుండు జంభాసుహృ
త్సౌధాగ్రస్థహిమకుంభనిభ మించన్ బింబబుద్ధిన్ నభో
వీథిం బోయి దినేంద్రుని బొదువఁగా వీక్షించి రాహుగ్రహం
బాధిం జెంది పయోజసంభవున కయ్యాశ్చర్యముం జెప్పినన్. 11

మ. విని రోషించి కషాయితాత్ముఁడయి భావిబ్రహ్మపై బ్రహ్మయున్
దనదివ్యాస్త్రముఁ బాపఁగా నదియు నుద్యత్కోటిమార్తాండలం
ఘనసంసూచకయుగాంతదీర్ఘతరనిర్ఘాతచ్ఛటాభీలని
స్వనభీష్యద్ద్రుహిణాండభాండఘటనాసన్నస్వతంత్రేశమై. 12

చ. కళకళ నందుచుం బొదువఁ గన్గొని మారుతసూతి వాలమున్
బిఱబిఱ ద్రిప్పి కొట్టుటయు బెండయి తచ్ఛిరమున్ బెళాలునన్
విఱిగిన జంభవైరిముఖదివ్యులు బాలుర కిట్టిబెట్టిదం
బిరుదుగ నెన్నటం గలుగునే? యని కోయనియార్చె నుగ్రతన్. 13

క. బవరంబున కరుదెంచినఁ, జవిరెం దంభోళికర్కశం బగుతోఁకన్
దివిజులు బెగడఁగ నంజన, జవమునఁ బఱతెంచి పలికె శక్రాదులతోన్. 14

క. చిన్నశిశువు పసిపాపఁడు, కన్నులు దెఱవఁడు చక్కఁగా బవరము ము
న్నెన్నఁ డెఱుఁగం డనిచన, కిన్నిసువుం బొదువఁ జేతు లెట్టాడెనో? 15

ఆ. పాలపాపఁ డగుట బాలభానునిఁ జూచి, పండటంచు వచ్చి పట్టికొనినఁ
బట్టి బట్టి యుగ్గు పెట్టి పోరాడక, నిట్టు ఇట్టు సేయ నేల? యనిన. 16

మ. పరమేష్ఠిప్రముఖామరేశు లనిలోఁ బద్మాక్షి! నీపుత్త్రుతోఁ
దరమే? పో రొనరింప మాదృశులకున్ ధాత్రాశుగస్తంభనో
ద్ధురదోస్తంభవిజృంభణోగ్రుఁడు సమర్థుం డాట నీ మేటికిన్
బరుఁడై మీఱునవీరుఁ డెవ్వఁ డని సంభావించి రాసాటికిన్. 17

ఉ. మాటలు వేయు నేల? హనుమంతు మహాబలవంతుఁ డిన్నిరా
ఘాటపటుప్రతాపశిఖ గ్రమ్మిన నీ వెసమాయ లాయెకం
బాటి వహించునే? యుఱక పై నుఱుకం జను కోటిధాటి? యి
ప్పాటి క్షపాటకోటికి నపాటము గాటముగా ఘటిల్లదే? 18

క. చిత్తేశ! నాప్రియోక్తులు, చిత్తములో హత్తికొనుము శ్రీమారుతిపై
బత్తి గనుము బహుసుఖసం,పత్తి మనుము నీ వటంచుఁ బహుతుక చెలుపన్. 19

క. అలదోషాచరుఁ డను ని,శ్చలదోర్బలశాలిఁ దొడరఁ జనిన నెటులు గాఁ
గలదో యని వెఱపవల దో, యలదోపమవేణి! నాదుశౌర్య మెఱుఁగవే? 20

క. అని పలికె నంత నిక్కడఁ, దనుజునికి నరను యవ్విధము చారులచే
వినిపింప విని విభీషణుఁ, డనిలజుకడ కేఁగుదెంచి యప్పుడి ట్లనియెన్. 21

ఉ. టక్కరు లుక్కువుల్ బలుతుటారులు క్రూరులు వేషధారులున్
రక్కసు లాట నెక్కరణి రాయిడి సేయఁ దలంచివత్తురో
యిక్కపికోటికిన్ నృపుల కిప్పుగదా! బహిరంగజీవ మిం
కొక్కటి పేర్మిఁ బ్రోవఁదగు నింపఱ నేఁ డని విన్నవించినన్. 22

సీ. ఆత్మీయచలనలీలాధూతకంజాతగర్భాండభాండోర్ధ్వఖర్పరంబు
నిజకర్బురప్రభానిర్భేదితక్ష్మాధ్రశాసనోపగ్రబాణాసనంబు
ప్రత్యర్థిరాక్షసప్రాణాపహృతిక్రియాఖేలకాలవ్యాళఖేలనంబు
పర్వతోత్పాటనోద్భటపాటవకఠోరతాటోపవిజితవజ్రాయుధంబు.
తే. నై వెలుఁగెను లాంగూల మట్టె పెంచి, క్రింద మీఁదట నెల్ల నేకీభవించి
చుట్టు నేరుఁ గోటఁగాఁ బెట్టి యొక్క, పట్టునను నెట్టుకొని గాఢపట్టి యుండె.

తే. వజ్రపంజరమున నున్నవానికంటె, నిశ్చయస్థితిఁ గపికోటి నిదురఁ జెంద
శ్రాంతిఁ బొందిరి రామలక్ష్మణులు నపుడు, ప్రహరి దిరుగుచు రావణభ్రాత యుండె.

వ. అయ్యవసరంబున. 25

ఉ. గాఁడుపుగావిబొట్టు మొలఁ గన్నపుఁగత్తియు నలివట్టిలో
ఘూఁటిననొక్కుబూదిముడి మాయలమందుకరాట మొంది దో

పాటుఁడు దొంగయంగున రయంబున వచ్చి కపీంద్రువాలః
గోటితెరం గెఱుంగుటకుఁ గూర్చినవేగులవారిఁ బంపినన్. 26

ఆ. నేల త్రవ్వి త్రవ్వి నిలిచె సూపముఖుం, డెగిరి యెగిరి ఘటకుఁ డెత్తువడియె
వెనుక ముందు గాఁగ వినికిచేసినవారి, వలనఁ గోటతెఱఁగు వాఁడెఱింగి. 27

పంచచామరము.
విభీషణాకృతిన్ వనాటవీరుఁ జేర మైత్రిపూ
ర్వభాష లాడి చొచ్చి పోయి రాము లక్ష్మణున్ నిజ
ప్రభావలీలఁ గాంచునాత్మపట్టణంబుఁ జేరఁ బో
యి భద్రకాళిచెంత నుంచి యుంట వేడ్కనున్నచోన్. 28

సీ. అంత విభీషణుఁ డవ్విధం బెఱిఁగింపఁ బాతాళలంకేశుపట్టణంబు
మార్గంబు గని పోయి మత్స్యవల్లభనాముఁ దనకుమారు రణంబునఁ దరించి
నగరాంతికమున నున్నఁ బదంతరంబున దుర్దండి యనుదానితోడువలన
దనుజుమర్మ మెఱింగి ద్వారపాలురఁ జంపి పురిఁ జొచ్చి పలుసేనఁ బొలియఁజేసి.

తే. తస్కరుచి బుత్రమిత్రపౌత్రంబు గాఁగఁ, దక్షణంబునఁ దునిమి దుర్దండిసుతున
కప్పుడ మొసంగి యాతఁడు తన్నుఁ గీర్తింప,రాసుతులఁ దెచ్చెఁ గ్రమ్మఱ నాథునుండు.

క. ఇట్టియసహాయశౌర్యం, బిట్టనిగూఢప్రయత్నహితచాతుర్యం
బిట్టిఘనధైర్య మంజన, పట్టికె కా కెందుఁ గలదె? పరికింపంగన్. 30

క. కపు లలరి రుర్విఁ నాలో,కపులఁ గని జగము లుత్సుకత్వ మెనసెఁదో
రవుమహిమ హనుమ నిర్జర, రిపుహాఁచ్చరుని సంహరించుటవలనన్. 31

ఉ. ఆప్పుఁడు దన్నుఁ గేర్చి యిటు లాపదఁ జెందినఁ బజ్క్తికంఠుఁడుం
బ్రాప్తవిచారుఁడై మఱి యుపాయము గానక సంగరక్రియో
ద్దీప్తమనోగతిన్ రఘుపతిన్ దొడరన్ జనుదేర విక్రమా
వాప్తిని ఖడ్గరోముసిని వాయుకుమారుఁడు డాఁకె వీఁకతోన్. 32

క. నిస్తులనిజముష్టిహతి స,మస్తము స్తుతియింప దనుజుమస్తముఁ గెడపన్
భూస్తటిఁ బడె వాస్తోష్పతి, హస్తాసిధ్వస్తపర్వతాకృతి వాఁడున్. 33

మ. అనిలోఁ బజ్క్తి ముఖాహగప్రహృతి సేయంజాలియున్ వాయునం
దనుఁ డిచ్చం దశకంఠకంఠదళనోద్దండైకదోర్దండమున్
దనకోదండవిముక్తచండశరకాండప్రాప్తకీర్తిప్రతా
పనిరూఢోన్నతి రామభద్రున కదభ్రస్ఫూర్తివర్తిల్లఁగన్. 34

క. పావనిముందర మశకము, రావణుఁ డన నెంత పట్టి రాచఁగ లేఁడే?
దేవునికీర్తి జగత్త్రయి, తావుకొనఁగ నూరకుండుటయ కాక యనిన్. 35

మ. కనకక్ష్మాధరదేహదీప్తి దనరాకన్ ముప్పునఁగాఁ దెల్ప ఘో
రనిశాటీకరిణీగణంబు హరిగర్జం దాఁకఁ గారానివా
సనిరుద్ధామరకామినుల్ ప్రమదబాష్పస్ఫూర్తి శోకాగ్నిఁ బా
య నిలాకన్యక డాయ వచ్చి వినయుం డై పల్కె సౌమ్యోక్తులన్. 36

క. చిత్రచరిత్రుఁడు కపిపతి, శత్రుశిరస్థిరమునఁ గాక సడలించెఁ జామీ!
ధాత్రికి నేఁ దెలుపుట జన,యిత్రీ! నిజ మయ్యె నని కపీంద్రుఁడు దెల్పెన్. 37

ఉ. నొచ్చిన నౌషధక్రియల శూల్కొనఁ జేయుట శత్రు నాశముం
జొచ్చుట హెచ్చుటల్ సహజశూరతఁ జచ్చినగంధమాదనున్
వెచ్చఁగఁ గాదె! యింత జగతీస్థలి నా విని గోత్రమాత్రజుం
డచ్చెరు వొంది తెల్పఁదగు నాకథ యన్న వసిష్ఠుఁ డిట్లనున్. 38

మత్తకోకిల.—
రావణాసురవీరుఁ బోరను రాముఁ డీగతిఁ జంపినన్
దేవతల్ చనుదెంచి స్వామి నుతించి కూలినవాన రేం
బ్రావళిన్ బ్రతికించి పోవ ననంతరంబున జానకీ
దేవితోఁ బతి పుష్పకస్థితిఁ దేఁరిల్లుచు వేడుకన్. 39

చ. ఘనముఖు లైనవానరశిఖామణులన్ దనపుష్పకంబుపైఁ
గనుఁగొని గంధమాదనునిఁ గానక యెక్కడఁబోయె నావుడున్
బెనఁగొనుభక్తి నప్పుడు విభీషణుఁ డాతఁడు కుంభకర్ణుతో
మొనసిన మైనలంతవడి మున్ననిలోఁ గడతేఱె నావుడున్. 40

ఉ. వేసనఁ దత్తఱిల్లి రఘువీరుఁడు పల్కె మఱియు కార్యలీ
లాప్రతిఁ దోడు వచ్చి యకటా! తెగటాఱెనె గంధమాదనుం
డిదురవస్థఁ బాప ఘనుఁ డెవ్వఁడొకో? యన జాంబవంతుఁడే
లా? దురపిల్లఁ బావని గలండు భవద్వ్యథ మాన్ప నన్నచోన్. 41

ఉ. భూపతి సంతసించి ప్రియపూర్వముగా హనుమంతుఁ జూచి మా
యాపద లెల్లఁ బాప మహిమాంబుధి నీవె కదయ్య! శత్రుచే
కూపడిపోయె నాతఁ డొకరుండు సమస్తకపీంద్రకోటిలో
నాపనిఁ బూని వచ్చి తెగినం దగునయ్య? యుపేక్ష సేయఁగన్. 42

ఉ. ఎక్కడ నున్నఁ దేఁగల వహీనబలాఢ్యుఁడ వేటి నిక్కడం
జిక్కిన కార్యముల్ దడవు సేయక సేయు మటంచు నక్కునన్
గ్రక్కున మక్కువం బొదివి క్రమ్మర మూర్ధముఁ జక్కి మూర్కొనన్
బొక్కపుబత్తి నిక్కి నృపసోమున కాయన మ్రొక్కి యిట్లనున్. 43

హనుమంతుఁడు బ్రహ్మలోకమునుండి గంధమాదనుం దెచ్చుట.

ఉ. హెచ్చన నేల? శ్రీరఘుకులేశ్వర! యిప్పుడె మృత్యుగర్భమున్
వ్రచ్చెద దండపాశభటవర్గముతోఁ బడఁబెట్టి యావలన్
జొచ్చెద నందుఁ జూడఁగలచోటులఁ జూచి నిమేషమాత్రలోఁ
దెచ్చెద గంధమాదనుని దేవర! చూడు మటంచు నుద్ధతిన్. 44

సీ. పెళ పెళ పెళ నార్చుభీకరార్భటులచే దిక్పాలిగుండియల్ దిగ్గుమనఁగ
బిర బిర బిరఁ ద్రిప్పుపృథువాలవిస్ఫూర్తిఁ దూలంబులై గిరుల్ తోననెగయఁ
గహ కహ కహ నవ్వుకఠినాట్టహాసంబు సురలఁ గాంతాశ్లేషసుఖులఁ జేయ
బిస బిస బిసఁ బోవుపెనువీఁక నిలలేక పైమేఘములు పటాపంచలుగను
తే. నుప్పరమునకు గుప్పించి యుబ్బి గబ్బి
నిబ్బరంబైన సంయమనీపురంబు
ద్వారమునఁ జేర్చి యార్చినఁ దత్తఱిల్లి
జముఁడు పఱతెంచి పూజించె సంభ్రమమున. 45

క. సద్భావ మెసఁగ నిట్లను, మద్భవనమునందు గంధమాదనకపి లేఁ
డద్భుతవిక్రమ! సరసిరుహోద్భవునెడ నిప్పు డాతఁ డున్నాఁ డనినన్. 46

ఉ. మంచి దటంచు మ్రొక్కి పవమానకుమారుఁడు భూర్భువర్మ్మహో
దంచితపుణ్యలోకములు దాఁటి క్రమంబున సత్యలోకముం
గాంచి తదీయవైభవము కన్నులపండువు సేయఁ బోయి య
క్కాంచనగర్భుఁ డున్నపురికాంచనకూటము సొచ్చి యచ్చటన్. 47

సీ. ద్వాదశార్కకిరీటతటకీలరుచు లంఘ్రిపద్మంబులకు మధుపములు గాఁగ
నమరఘాలన్యస్తహస్తాంజలులు వాకిటికిఁ బద్మకోశమాలికలు గాఁగ
నటనలీలాప్సరఃకుటిలాలకాలోకనంబులు నీరాజనంబు గాఁగ
వర్ణనాయితయతీశ్వరభాష లాత్మచారిత్రవన్యాలకుఁ గేరికలు గాఁగఁ
తే. దనసుతుండు వీణె వినిపించువిధమున
కెరద మయూరంబుగాఁ గూర్మి యిగురులొత్త

నాసరస్వతిఁ గూడి పద్మాసనమునఁ
గమలగర్భుండు పేరోలగమున నున్న. 48

తే. అచ్యుతజనంబు పసమేనిపచ్చనిబిగి, కచ్చెరువుఁ జెంద నలువకు వచ్చి మ్రొక్క
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి నీవచ్చుటేమి, మచ్చిక వచింపు పవనకుమార! యనిన. 49

ఉ. అక్కపిచంద్రుఁ డిట్లను మహాత్మ! సమస్తము నీ వెఱుంగవే?
యిక్కడ గంధమాదనకపీశ్వరుఁ డుండు టెఱింగి వచ్చితిన్
గ్రక్కునఁ బంపు మక్కపిశిఖామణిఁ జూడక పోవకున్న వాఁ
డక్కడ రాముఁ డన్న విని యాతని నిచ్చి విధాత యిట్లనున్. 50

ఆ. ఇతఁడు రామకార్యహితబుద్ధి ఘటకర్ణు, మేన నలఁగి తొంటిమేను మాని
యజరుఁ డమరుఁ డయ్యె నవని కంపఁగఁ జెల్ల, దైన నీవు రాఁగ నంపవలసె. 51

క. తను పుడిగినజనుఁ గ్రమ్మఱఁ, గొనితెచ్చెద ననుచుఁ బూనుకొని రా వశమే?
వినుతప్రభావతేజో, ఘన నీ వగుసేయంచె చెల్లెఁ గాక మహాత్మా! 52

మ. అని ప్రార్థింపఁగ బ్రహ్మ సన్నుతులు సేయన్మ్రుఁ దై గంధమా
దనునిం గౌఁగిటఁ జేర్చి తోడుకొని రాఁ దత్తజ్జగద్వర్తనుల్
దన తేజోబలధైర్యశౌర్యమహిమల్ వాక్రుచ్చి వర్ణింపఁగాఁ
జనుదెంచెన్ రఘురాముచెంత కతులాశ్చర్యప్రభావోన్నతిన్. 53

సీ. వచ్చితె మాతోడినెచ్చెలితన మిప్పు డఱచితో యని చెంతఁ జిరుగువారు
నీవు లేకుండిన నెంపఱు లేనట్లు యుండె మా కని చేతు లూఁచువారు
ఎచట నేతెంచె నీ కిటువంటిదేహంబు మరలనం చంగంబు లరయువారు
నా పేరు చెప్పుమా నాఁడు నే నే మంటి నని తొంటిచందంబు లడుగువారు

తే. ఎచటనుంటివి? మముఁ బాసి యిన్నిదినము, లెటుల నచ్చోటఁ గరుదెంచె నీమహాత్మఁ
డనుచుఁ గపు లెల్ల గంధమాదనునిఁ జుట్టుకొనిరి మృతజీవిఁ గ్రమ్మఱఁ గనుటఁ జేసి.

క. అనిలజ! నీవె విధాతవు, నిను మది గాకున్న మృతుని వెనుకొని మరలం
గొనితేవచ్చునె? యితరుల, కని కపివిభు లెంచ స్వామి కనిలజుఁ డంతన్. 55

తే. వినయమున మ్రొక్కి గంధమాదనవనాట, చంద్రుఁ బోడ గానిపింప నాశ్చర్య మంది
మెచ్చి కౌఁగిటఁ గ్రుచ్చి భూమిపతి యవల, సేతుతటమున శివుఁ బ్రతిష్ఠించె ననిన.

ఉ. గౌతమసూతి పల్కె ననఘా! మును రాముఁడు శంభులింగము
న్సేతువుభూమి నేమిటికి నిల్పె నొకో! పవమాననందనుం
డాతఱి నేమిదైన విహితాద్భుతకర్మము లాచరించెనో!
చేతన కింపు గుల్కఁగ వచింపు మనంగ వసిష్ఠుఁ డిట్లనున్. 57

ఉ. ఎక్కడ నద్భుతక్రియ వహింపఁడు? రామకథాంబురాశిలో
నక్కలిచక్రవర్తి సకలాత్ముఁడు రాము శివప్రతిష్ఠ పెం
పెక్కఁగనై ఘటించె విను మిక్కథ యక్కరణిన్ రఘూద్వహుం
డిక్కడ గంధమాదననగేంద్రము చెంగట వచ్చునంతటన్. 58
తే. దశరథాత్మజుఁ డుండఁ గాఁ దండకావ,నాంతరంబున నున్నమహర్షివరులు
వచ్చి పూజించి శుభసూక్తివైభవంబు, భాసిలఁగ నిట్లు నభినుతి చేసి రపుడు. 59
సీ. రవివంశసంజాత! సవనావనోపేత! ఘనశాతశరధూతదనుజజాత!
చలితయోషాశాప! దళితశంకరచాప! క్షితిసుతాంకదీప! శ్రుతికలాప!
భార్గవాహంకారభయదబాహాసార! సంప్రాప్తకాంతార! జయవిహార!
యినతనూభవపక్ష! యింద్రనందనశిక్ష! సింధుబంధనదక్ష! జితవిపక్ష!
తే. పాలితవిభీషణైశ్వర్య! పరమధైర్య!, రక్షితాయోధ్య! సేవకారంభసాధ్య!
శరణు వొందినవము నేఁడు కరుణఁ జూడు, రవిసహస్రమహస్సాంద్ర! రామచంద్ర.
క. అని కుంభసంభవాదులు, వినుతించిన సంతసించి విభుఁ డతిభక్తిన్
మునులకుఁ బ్రాంజలి యై వం,దన మొనరిచి ప్రావృడంబుదధ్వని ననియెన్. 61
సీ. అఖిలజీవులకు సంప్రాప్యుఁడ నైననే నతివిశుద్ధాత్ముఁడ నౌట కేమి
యరుదు మద్దృష్టిగోచర మైనజంతు వెప్పటికిని కైవల్యభాజన మగు
నైన సుస్వాంతవిజ్ఞానసంతుష్టుల శిష్టుల సర్వభూతేష్టతముల
నిరహంక్రియుల శాంతినిధుల జితేంద్రియు లగువారి నెఱిఁగి సాష్టాంగ మొరఁగి
తే. సేవ గావింతు బ్రహ్మణ్యదేవుఁ డనఁగ, నేను వేఁడెదఁ బౌలస్త్యుఁ డైనదైత్య
పతి వధింపంగ నైనదుష్కృతి దొలంగ,నిష్కృతి వచింపుఁ డిపుడు మునివరులార!

రాముఁడు బ్రహ్మహత్యానిష్కృతికై శివప్రతిష్ఠ సేయుట.

మ. అనినన్ మౌనులు సంతసించి పరమాత్మా! నీకు దోషంబు గ
ల్గునె? లోకంబు ననుగ్రహించుటకు నాలోచించి తద్దైన శం
భుని నిచ్చోటఁ బ్రతిష్ఠ సేయు దురితంబుల్ వాయు లింగప్రతి
ష్ఠ నుతింపన్ బరమేష్ఠి నేరఁ డన నస్మాదృగ్జనుల్ నేర్తురే? 63
తే. కాశికాలింగదర్శనాగతఫలమున, కరయ శతకోటిగుణితమహాఫలంబు
గలుగుజనులకు నీపేర గంధమాద,నమున నేఁపారుశివదర్శనంబు సేయ. 64
క. దంబడరఁగఁ బవనంబు జ,వంబడచు జవంబునన్ భవం బడఁప సదా
లంబ విలంబము సేయక, సాంబుఁ బ్రతిష్ఠింపు మని మహర్షులు పల్కన్. 65
వ. సంతోషతరంగితాంతరంగంబుతో హరిత్తురంగకులతరంగిణీరమణతరంగలాంఛనుఁ

డు లింగప్రతిష్ఠాపనంబున కథంగుడమాంగల్యముహూర్తంబు ప్రసంగించి మునిపుం
గవులవలన ముహూర్తద్వయమాత్రంబుగా నెఱింగి కుఱంగటం జెలంగుసమీర
కుమారుం గనుంగొని. 66

కం. కలధౌతధరాధరమున, కలిగినలింగంబు నాల్గుగడియలలోఁ దే
వలయు నట పోయి తెమ్మా! వలయుదువే యెట్టిపనుల కనిలకుమారా. 67

మ. అనినన్ స్వామి! హసా దటం చరుఁడు బాహాస్ఫాలి యై గంధమా
దన మెట్టటు యూఁగఁగా నెగిరె గంధర్వాప్సరస్సిద్ధసా
ధ్యనిశాటోరగకిన్నరప్రముఖు లాహా యావిజృంభంబుతో
నను కైలాసమె తెచ్చునో యని ప్రవోన్నత్యంబు వర్ణింపఁగాన్. 68

తే. ఎగిరి కైలాసగిరిఁ జేరి తెగువ మీఱి, యల్లసామీరి శివలింగ మందు వెదకి
వెదకి కానక కానకవిభుఁ దనర్చు, నచటఁ గానక వెఱఁగంది యందు నిలిచి. 69

మ. చరణాంగుష్ఠముచేత భూమిఁ బొడగొని పక్షద్వంద్వమున్ విచ్చి భా
స్కరు వృష్టించుచు నూర్ధ్వబాహుఁ డయి నిశ్వాసంబు బంధించి బం
ధురనిశ్వాసముతోఁ దపంబు సలుపన్ దోడ్తోన ప్రత్యక్షమై
హరుఁ డిష్టార్థము వేఁడు మన్న వినతుండై పల్కె సద్భక్తితోన్. 70

కందద్వయగర్భితసరసిజవృత్తము.—

వీనా నిన్నున్ ధ్యానమహీనాదృతి గొని కనుఁగొన నెవ నహహ మహా
మౌనీశానుల్ భానుసమానుల్ మది నిజ నెఱుఁగక మనికితపమెఁగా.
ఏనామం బే లోనిడినే నంతటిమిఁ గొలువఁగ నెనరున దనరన్ *
సానందోక్తుల్ మానక యా నంచని మనుపఁగఁ దగు వనప్రభనయనా! 71

కందద్వయగర్భితభాస్కరవిలసితవృత్తము.—

తాపము గెడపఁగ నోపినచూపున్ దాపసమనసుల సొబగగురూపున్
పాపపుదనుజుల మాపినయేపున్ బంకజభవునకు హితవగుతూపున్
గోపురవిలసన మాఁగినమూపున్ ఘోరహాలహలము మొనసినయేపున్
గోపతిగమనము చూపినకోపున్ గూడితవరుచిఁ గొలిచెద నభవా! 72

స్రగ్విణీభుజంగప్రయాతగర్భితవృత్తము.—

శ్రీకపర్దీ! మునిశ్రేయ! కామాపహారీ! కృపావార్ధి; నీరేజహృత్సేకరా
ధ్యా! కపాలస్ఫురద్ధస్త! గండేభదారీ! కపోలోజ్జ్వలశ్రీ! జగజ్జీవనా! 73

తే. వేళ తప్పక రమ్మని విభుఁడు పల్కె, నిప్ప మొనఁగూర్పవే యన్న నీశుఁ డలరి
ధ్యానని కప్పుడు లింగద్వయం బొసంగి, తత్క్షణంబునఁ జూడ నంతర్ధిఁ జెందె. 74

పంచచామరము.—

ధరాధరాధిరాజభూసుధాధరాధరాధరా!
ధరాధరాతిదూరసారదాచ్ఛకీర్తిసుందరా!
పురందరావరాగదారణాపురందరా!
సురాసురస్థిరాసురార్చ్యశుద్ధమూర్తిభాసురా! 81

తే. అని నుతించినఁ బ్రత్యక్షమై శివుండు
మీరు నిల్పినలింగ మీ మీఁద సకల
పూజ్యమును దోషహారమును బుణ్యఫలవి
ధాయి యగు నిక్క మని యేఁగెఁ దత్క్షణంబ. 82

తే. శ్రీరఘుస్వామి గంగాభిషేకమునకుఁ
బానశుద్ధోదకములకై తత్సమీప
ధరణిఁ దనవింటికోపునఁ ద్రవ్వి నూయి
సేయ నది కోటితీర్థప్రసిద్ధిఁ గాంచె. 83

ఆ. వినినయంత సుకృతవిభవరీతు లమర్చుఁ
గనినయంతఁ బ్రకృతికడకుఁ జార్చు
శుభము లొసఁగ నేర్చు నఘిమతం బొనఁగూర్చు
కోటిసరము కలుషకోటిహరము. 84

తరల.—

సురమునీంద్రులు సిద్ధసాధ్యులు శోభనక్రియ [illegible]నకీ
పురునిలింగము పూజసల్పిరి వానరుల్ పరమాదరా
గరసవారిధి నోలలాడిరి కంజగర్భదిగీశ్వరుల్
పరమభక్తి నుతించి రన్నదు బల్కె శ్రోత వసిష్ఠుతోన్. 85

క. కాలము దప్పక రమ్మని, లాలించి మరుత్సుతుని నిలాపతి పనుపన్
గైలాసంబునకుం జని, యాలస్యము చేసెఁ దెలుపుఁ డతనికత యనన్. 86

చ. మునిపతి గౌతమాత్మజుని మోము గనుంగొని పల్కె నీగతిన్
దినకరవంశుఁ డీశ్వరుఁ బ్రతిష్ఠ యొనర్చినమీఁద వాయుసూ
నుఁడు సమందబుద్ధి శివదత్త మహత్తరలింగయుగ్మముం
గొని ఘనవేగి యై గిరులు ఘూర్ణిల వచ్చుచుఁ ద్రోవలోపలన్. 87

ఉ. ఉగ్రమయూఖవంశుఁడు ముహూర్తము దప్పక లింగమూర్తిఁ బ్ర
త్యగ్రవిధిని నిల్పఁడుగదా! జగదాదరణీయకీర్తి మ

సెగం బెట్టునిట్టూర్పుచే మోము వాడన్
దగం దొట్టునక్షెట్టి దర్శించి క్రీడన్. 96

క. కరుణ జిగి చూపుమాపులు, చిఱునగవు ప్రసన్నముఖము చిన్నిపలుకులున్
మరులుకొనఁజేయఁగసోయగ, మరుమగ నను రామదేవుఁ డనిలజుతోడన్. 97

ఉ. ఇంతవిచార మయ్యెఁగద! యేనుప నీ తనుభేదయుక్తిని
స్వాంతమునందు వర్తిలుట నన్యుఁడు నే నను చింత యెంతప
ర్యంతము జంతుసంతతిహృదంతమునందు వసించు నంతప
ర్యంతము జన్మమృత్యువుల కంతము లేదు సమీరనందనా! 98

ఉ. ఊరక శోకమందెద వయో! వినయోన్నత! సన్నుతుల్ తిర
స్కారము లాత్మరీతిఁ గన సర్వము దేహగతంబు లెవ్వియుం
జేరక చిత్స్వరూప గతిఁ జెల్వగుసేకు శరీరమం దహం
కారము దూర మైన నధికారము గల్గెడుఁ దత్త్వసిద్ధికిన్. 99

క. నిత్యానిత్యవివేకము, ప్రత్యేకము దేహ మనెడుభావము నంత
స్థిత్యచలత్వము గల్గిన, సత్యాశయుఁ డొందు ముక్తిసంపద ననఘా! 100

చ. జననము నొందుజంతువులు సజననం బయి యున్నజంతువుల్
తనువులు వీడు జంతువు లుదారగుణాకర! లెక్కలేవు సం
జననము నొందునప్పుడయ చచ్చుట తప్పదు చచ్చినప్పుడే
జననము తప్ప దేటికి విచారము? నిత్యమె దేహ మేరికిన్? 101

చ. కలిగినయట్టె యున్నవి జగంబులు స్త్రీధనజాతసౌఖ్యముల్
తలఁగనియట్టె యున్నవి సతం బయి దేహము కాలసంగతిన్
నలఁగనియట్టె యున్నది జనంబుమనంబున కింత మాయ వె
గ్గల మని యుగ్గడింపఁ గలకారుణికుండు గురుండు గల్గమిన్. 102

చ. చనియెడువేళ భోజనము సల్పెడువేళ శయించువేళ లే
చినయెడఁ గామినీరతి వసించినవేళఁ గృతాంతుఁ డీజగ
జ్జనముల వెంబడిన్ విడువఁజాలక ద్రిమ్మరుచున్కి నిచ్చలోఁ
గనుఁగొనలేక లోకు లధికస్పృహ మాన రదేమొ! మేనిపై. 103

క. ఈదేహమునకు నీకును, లేదనుబంధ మన దేహలీలావిభవా
పాదిత మగునొకవస్తువు, నీది యగునె? యేల భ్రమ? మనీషివరేణ్యా! 104

తే. కర్మవశమున సుఖము దుఃఖము జనించు, నదియె బీజంబు వివిధదేహాంకురముల
కంగసంగతి హెచ్చుగుం బసుటఁ దొలఁత, దేహి దేహవిభేదంబు దెలియవలయు.

క. పరవస్తువు నావస్తువు, వరి మిత్రుం డ నెడువికృతి యంతయు నంతః
కరణవశంబునఁ గా యని, పరికించితి వేని భేదభావము వాయున్. 106

క. ఏనును నాయది యనునభి,మానంబునఁ గాదె జననమరణము లగుటల్!
మానసమున దేహాద్యభి,మానము లేకున్నఁ బో బ్రమాదము గలదే? 107

క. తను వభిమానించినయది, మన మగుటన్ బుద్ధివలన మఱి దోఁచిన వె
ల్లను మిథ్యగా నెఱింగిన, ననఘా! దేహాభిమాన మంత నడంగున్. 108

క. ఒద లన్య మస్థిరం బని, యాత్మ తెలిసికొని దీన సౌఖ్యము దుఃఖం
బెడ చేసి శత్రువుం బలె, విడువుమికం దదభిమానవిభవము వత్సా! 109

తే. నిజము చెప్పెద విను నీకు నిఖిలజగము, ప్రకృతివశమునఁ గలిగినభాతిఁ దోఁచుఁ
గలిగినది కాదు జ్ఞానియై కాని దాని, కల్పితం బని యితరుండు గానలేఁడు. 110

సీ. ప్రత్యక్ష మైనప్రపంచ మేలాగున సత్యంబు గా దని సంశయించి
కలిగినవిశ్వంబె కాదన్నఁ గనరానియాత్మ నిశ్చయ మెట్టు? లని తలంచి
కర్మాతిశయమునఁ గాదె? బ్రహ్మాదులు ఘనులౌట లని కర్మగతి నుతించి
పరమాత్మకును జీవభావంబునకు భేద మై యుండు నైక్య మెట్లని చలించి

తే. విపులవిపరీతసంశయావేశు లగుచు, నజ్ఞు లై శ్రీధనాసక్తి నన్య మెఱుఁగఁ
జాలక దయుక్తి గురుభక్తి నలుపలేక, మూఢులు సంసారమునఁ జిక్కి చెడుదు రనఘ!

క. అంతఃకరణవశంబున, జంతువులకుఁ జావుపుట్టు సంగత మైన
ట్లెంతయును దోఁచుఁ జూచిన, భ్రాంతియకా కందు లేవు భవమరణంబుల్. 112

తే. పవననందన! సకలప్రపంచమునకు, నశ్వరత్వంబు సిద్ధంబు శాశ్వతంబు
బ్రహ్మ మిందును సందియపడఁగ నేల? మనన మొనరించి తెలియుమీ మానసమున. 113

ఆ. పంచభూతములకు బంచేంద్రియములకు, విషయములకుఁ జిత్తవృత్తులకును
దెలియఁబడక తాను దెలివియై యున్నంటిఁ, దెలియుచున్న తెలివిఁ దెలిసికొనుము.

క. జ్ఞాతృజ్ఞానజ్ఞేయము, లేతాదృశబుద్ధి విడక నేకాకృతి నే
చైతన్యంబునఁ గనఁబడు, చైతన్యమె చూడఁ గలుగు సౌఖ్యము లెల్లన్. 115

తే. తనువు కడఁ ద్రోసి మది నొంపుతలఁపుఁ బాసి
కన్నుఁగవచూపు చంద్రభాస్కరులమండ
లాగ్రముల నుంచి లింగత్రయప్రముక్త
సచ్చిదానందరూపంబు సరగఁ గనుము. 116

ఉ. తత్త్వము లైదు వాటిలఁగ దాఁ దను వయ్యెఁ దదీయమోహసం
గత్వమునం గదా భవము గల్గె నటంచు వివేకి వై రజ

స్తత్త్వతమోగుణేతరవిశాలమతిం దిలకించి చూడు మా
తత్త్వమసీతివాక్యభరితస్ఫురితార్థము వాయునందనా! 117

క. ప్రీతిని హృదయాకాశము, ఘటాకాశంబుఁ గలయ బొందించినచో
నాతఁడె గతలక్ష్యం బగు, చైతన్యాకాశ మొదవు సౌజన్యనిధీ! 118

క. పొడవుగఁ బెరుఁగుట లెల్లను, బడుటకొఱకె కూడు టెల్లఁ బాయుటకొఱకే
పుడమిం బొడముట లెల్లను,గడపట లయమందుకొఱకె గా! కపిముఖ్యా! 119

తే. కాన నిలోన దేహాభిమాన ముడిగి, యద్వయజ్ఞాననిష్ఠ నహర్నిశంబు
నాత్మ చింతయె ఘటియింపు మందువలన, మొనయ నేరవు భవరోగములు కపీంద్ర!

క. మత్కృతము త్వత్కృతం బగు,త్వత్కృత మగు మత్కృతంబు ద్వైతమువలదో
సత్కృతి లింగస్థాపన, సత్కృతి సేవాచరించుసత్కృతి గాదే? 121

ఉ. లగ్నము చారు వౌట జటిలప్రవరుల్ వివరింప భూసుతో
ద్విగ్నమృగాక్షి చేసి యొదవించినసైకతలింగముల్ ప్రియా
మగ్నత నిల్పి పూజన లమర్చితి మిచ్చట నింతమాత్రకై
భుగ్నతఁ జెంద నేల కపిపుంగవ! నాపలు కాదరింపుమా. 122

ఉ. ధీరవరేణ్య! నీ విపుడు దెచ్చినలింగము నేఁడె నిల్పి నీ
పేర జగంబులన్ వెలయఁ బొంపుగ నెల్లజనంబు లింక నీ
పేరిటిలింగమున్ మొదటఁ బేర్కొని పూజ లొనర్చి యంత
నా పేరిటిలింగముం గని యభీష్టగతిన్ భజియింతు రెప్పుడున్. 123

ఉ. ఈవును బ్రహ్మరాక్షసుల నెందఱనేని వధించి తాఁ గలాఁ
గావున నీదు పేరఁ గుతుకంబున శంభుఁ బ్రతిష్ఠ చేసినన్
బోవు నఘంబు లెల్ల పయిఁ బూని మహేశుఁ డొసంగినట్లె
దేవుని వామదేవుని ధృతిం దిలకించినవారె యుత్తముల్. 124

వ. అని మఱియు నిట్లనియె. 125

మ. సికతాలింగము నిసి లింగముఁ బ్రతిష్ఠింపం బలం తేసి దు
శ్శకమా కార్య మటంచు లన్నఁ దిలకించన్ సప్తపాతాళభూ
మికలం బామకొనెన్ మహేశుఁ డిఁకఁ బేర్మిన్ దియ్యనే శౌర్యరా
శి కశక్యం బటు గాక నీసినఁ బ్రతిష్ఠింతున్ భవల్లింగమున్. 126

చ. అనవుడు నెమ్మొగంబుఁ దెలియం గయునవ్వున గంధవాహనం
దనుఁడు రఘూద్వహాంఘ్రులకు దండము వెట్టియు దెంత కార్యమో

దినకరతేజ! దేవప్రతిష్ఠ గదా యని కొంకినాఁడఁ గా
కనిమిషశైలమైన ద్రుహిణాండము దాఁటఁగ మీటఁ నేరనే? 127

సీ. అని విజృంభించెఁ బావని నా శతానందుఁ డావసిష్ఠునిఁ జూచి యచ్చెరుపడి
పరతత్త్వమార్గంబు పరికించి వినిపెను మత్ప్రతిష్ఠితశివోత్పాటనంబు
పరుల కసాధ్యమం చెఱిఁగియు స్వామిభృత్యన్యాయసరణి దానధికుఁడయ్యెఁ
దన కసాధ్యం బైన దాశరథీశ్వరోత్పాటనోద్ధతి కేల పాలుపడియె?

ఆ. నెఱుఁగ కిట్టిచెయ్ది మొనసెనో యెఱిఁగియుఁ, జేయవలసి చేసెనో యథార్థ
వచనరచనఁ దెలుపవలయు నాన్నుడుం దెప్ప, యడిగి తని వసిష్ఠుఁ డతని కనియె.

సీ. శ్రీరామలింగంబు సికతామయంబుగాఁ గాంచించు లోకుల భ్రాంతిఁ బాపఁ
బరఁగ సాంబద్రోహ మొదవించి ఘనుఁడైన నెఱి దూలుననుమాట నిర్వహింప
నతలాదిలోకముల్ వ్యాపించె శివ్రుఁ డన్న రామువాక్యము నిదర్శనము సేయ
నణురేణువైన రామోపాసకుండు నిల్ప నొరుల కసాధ్యమౌ టెఱుకపఱుపఁ

ఆ. దలఁచి రామనాథదైవతోత్పాటనో, ద్ధతి వహించెఁ గాక ధర్మవేది
పరమపుణ్యుఁ డతఁడు ప్రత్యక్షపరమేశుఁ, డజ్ఞుఁడే చెలంగ నవల వినుము. 129

వ. ఇవ్విధంబున దశకంధరపరిపంథివచస్సంధిముద్ధి నుసరింపక గంధవాహనందనుండు
పుండరీకంబునను శుండాదండంబు నిగిడించుమదవేదండప్రకాండంబుమొందున
నాఖండలాదినిఖిలమ్మండలఖండనసముద్దండదండధరాఖండప్రతాపప్రచండదైతేయ
మండలేశ్వరమదాంధకారమార్తాండ కరప్రకాండభీకరతరకరప్రకాండంబుసారించి
నిటాలలోచనవిలోకనజాయమానభయవేపమానగౌరీమానవతీ మానాక్రాంతిత్వదృఢా
లింగనం బగు రామనాథలింగంబు ననాయాసంబునం బెకల్చి యగలన్న దిగులువడక
కలకల నగుచుఁ గిలకిలాధ్వటి సముద్ఘటించి మోఁకరించి వాలం బెగవట్టి కరద్వయం
బునం బట్టి దిట్టతనంబున నిట్టట్టుగా నూఁగియుఁ బట్టుకన్న గట్టియై పట్టుకొన్నయట్టి
లింగంబు నెడ నుట్టిపడుకట్టల్కఁ సహంకారంబున హుంకరించుచుఁ జటచ్ఛట కటక
టంబు లదరఁ జటులతరలోచనంబులఁ జిటిచిటి నిప్పుకలు చెదర గిఱిగిఱి పండ్లుగీటుచు
బహుపక బ్రహ్మాండభాండంబు వగుల నట్టహాసంబు చేసి యిట్టియీశ్వరాపరాధం
బున నేమి పుట్టునో యని పుడమిపట్టి బిట్టడల నింతయహంకృతి దగునే యని
లక్ష్మణుండు నొచ్చుచు నిబలవంతున కింత యసాధ్యం బగునె యింత యని రమాకాం
తుండు చలింప రామప్రయుక్తతృణంబు ద్రుహిణాస్త్రం బగు టెఱింగియుఁ
దత్ప్రతిష్ఠితలింగంబు భంగంబు నొందింపఁ దలంచుట వివేకంబు గాదని విభీ
షణుండు దూఱ నాడూడ నంగద సుషేణ నల నీల పనస జాంబవదాదివనచరనాయ

తులు వమునఁ దోఁచిన తెఱంగునఁ బలుభంగులం బలుక రసాతలాధ్యక్షునికటాక్షం బున జగత్ప్రాణసూనుని ప్రాణంబులకు హాని లేకుండెడు నని మహాత్ములాశీర్వ దింప నభోభాగంబున వారలు గీఱి నగవిదారిప్రముఖబర్హిర్ముఖు గరుడ గంధర్వ కిన్నర కింపురుష యక్ష రాక్షస సిద్ధ సాధ్యాదిపియచ్చరులు నుచ్చైకంఠులతో నిచ్చ నచ్చెరువడి చూడ సప్తమారుతంబులు నిజానుమానలంబుగా వాలంబున బలంబు గూర్ప పాటి యేర్పఱుపరానియున్నిద్రరౌద్రంబునఁ బ్రళయకాలరుద్రుని కరాల రుద్రుం డై దిక్కూలంకషభుజసముల్లోలకల్లోలంబు లై సప్తసాగరంబులు గలంగ నభంగభయభంగురంబు లై సప్తద్వీపజనంబు లల్లలాడ సప్తాశ్వప్రముఖగ్రహ నివహంబులు త్రోవలు దొలంగ సప్తకులపర్వతంబులతో ధరాతల ముఖ్యాంత లూఁగ మహాభూతంబు లాక్రోశింప దిక్కరులు ఘీంకరింప భూమిభరంబు భరింప లేక వ్యాకులపడు కాకోదరలోకనాయకునిఁ బట్టి నట్టిట్టుగుంజరకతమతపరిభ్రమణ నాను టకై ముట్టె బిగఁబట్టి యాదిమకిటిపట్టభద్రుండు గట్టిగాఁ బీటపెట్టె కొట్టియుత్పా తంబు పుట్టె నని పట్టుపుట్టంపుఁబట్టంపువేల్పుపట్టి బెట్టెసపుఁజింత దొట్టికొనఁ బాశాంకుశ త్రిశూల డమరు ఢక్కా టంక ఖట్వాంగాదిసాధనంబులు గైకొని తత్తఱించు కుమారప్రముఖప్రమథులు వారణాననవిరూపాక్షులు నైరించి కాచి యుండ నానతాంగంబున సమంబులుగాఁ గరచరణంబులు కీలుకొలంబునం బెట్టి సింధు బంధనసమయసముత్పాదితసంధరధరాధరబంధురరేఖాభ్యుదయవసుంధరాధరజాలం బగువాలంబున లింగపురాల మామూలంబుగాఁ జుట్టి పట్టి చలపట్టి కరువలిపట్టి యప్పట్టించుకయుఁ దప్పించి యుప్పరంబునం బెట్టెననని పట్టుపలుగనుపట్టి మిట్టి పడుగట్టుఁజేనిగుట్టు మట్టుపెట్టుగట్టి తనంతన బిట్టొగసి రంగంబు వీక తనతోడ వెంట నంటిరాక నిరాకరించుటం జేసి యాకసంబున నిలుపంబడలేక సకలలోకపాల హాహాకారంబులతో నవరంధ్రంబుల బుడబుడ నెత్తురులు వడియ వడి యడఁగి యక్కడికి రెండుగడియలయెడ నొడలెఱుఁగక పరవశుండై పుడమిం బడియె నప్పుడు. 130

క. పవమానతనూజన్ముని, నవరంధ్రములందుఁ దొరఁగునవరక్తము పే
నవలోకసురవధూదృక్కువలయవలయ మనరక్తమండము వెలసెన్. 131

సీ. గమనవేగంబున ఘనజటాబంధంబు గళితమై యంసభాగమున గునియఁ
గేలఁ గుచ్చెలకొంగు గీలించి దగ మించ నసురుసురై సీత యరుగుదేర
భుజముల వెడజాఱుభుజపత్త్రపల్లవాంచలము చేఁబూని లక్ష్మణుండు నడవఁ
గైదండ యొసఁగుటకై దండసాఁచినశయ్యముతో దశవిభీషణుండు రాఁగ

తే. నేరిపైఁ జింత లేక హాహారవంబు, తోడఁ గన్నీటిమున్నీటఁ ద్రోవ దడియఁ
దడయ కప్పుడు దశరథాత్మజుఁడు వచ్చెఁ, బవనతనయుండు మూర్ఛిల్లి పడినయెడకు.

ఉ. అప్పుడు ధూళిధూసరితుఁడై కనుదమ్ములు మోడ్చి మక్షికల్
గప్పఁగొనంగ నెత్తురులు గ్రక్కెడునక్కపిముఖ్యుఁ జేరి మా
యప్ప! యిదేమిరా? యని ధరాత్మజ కన్నుల బాష్పపూరముల్
చిప్పిలఁ గేలుదమ్మిఁ దుడిచెన్ దనుసక్తధరాపరాగమున్. 133

తే. అచట వసియించి తొడమీఁద ననిలసుతుని, శిరము గీలించి నెత్తుటిచేతఁ దడిసి
పుల్లసిలు మోము గనుఁగొని తల్లడించి, ప్రేమ సీతాధిపతి విలపింపఁదొడఁగె. 134

ఉ. దాయలశూల ముద్గర గదా పరశు క్షురికాది హేతులం
గాయము గీయముం గనని కాయ మపాయముఁ జెంది కందెనే
మోయి? మదీయసూక్తి వినవోయి! యి దేటికి మాటలాడ వా
హా! యసహాయశూరవిజయైకవిహార! సమీరనందనా! 135

క. మాతయుఁ దాతయు మీరని చేతులు మొగిడించి సేవ సేయుదువుగదా!
నాతండ్రి! మున్ను నాకును, సీతకు నిపు డేల? భక్తి సేయవు చెపుమా! 136

ఆ. కన్న తల్లిఁ దండ్రి నన్నసోదరులను, జిన్ననాఁటనుండి చెలిమినిండి
మన్నవారి నెల్ల మఱచియుంటిఁగదోయి, గాడ్పుపట్టి నీవు కలుగఁబట్టి. 137

ఉ. క్షోణికుమారికామణి నశోకవనిం గని సంతసించి త
త్ప్రాణము నిర్వహించి వనపాలకులన్ విదళించి రావణా
రీణచమూవరేణ్యుల హరించి చరించుట లెంచ కక్కటా!
స్థాణువుచంద మొంది వివశత్వముఁ జెందుదురయ్య? పావనీ! 138

ఉ. పటుకగర్భబాణము నిశాటకుమారుఁడు నాటనేయఁ బో
రాటము వాయఁ బట్టువడి యట్టిటు మిట్టిపడంగ రావణున్
నోటికి వచ్చి నట్టని యనూనభుజాగతి నిటుమేటికిన్
బాటిలె నేటికిన్ వివశభావము దైవమ! యేమి సేయుదున్? 139

క. నేమంబున నీవున్నను మామూర్ఛ లడంచి ప్రాణి మరలింతు వయో
నే మెందఱ మున్నను నిను, నేమంబున మూర్ఛ దెలుపనేరము తండ్రీ! 140

తే. అకట! కనుసన్న చేసినయంతమాత్ర, నాత్రమున నేఁగి సంజీవనౌషధంబుఁ
దెచ్చి యిచ్చిననినువంటిధీరమణికి, జీవ మెడఁబాయనాయె సంజీవరాయ! 141

ఆ. జగతి యేల నేల సౌమిత్రి యేల సీ, తాలతాంగి యేల తక్కియున్న
వార లేల నిన్నువంటిగుణాఢ్యుండు, లేకయున్న నాకు నోకుమార! 142

క. అని పలురీతుల మారుత, తనుజుని వదనాంబుజంబు దర్శించుచు రా
మనృపాలకచూడామణి, కనుఁగవ పెన్నీట నతని కాయము దడిపెన్. 143

ఆ. అంత మూర్ఛదేఱి యక్షరక్షోవైరి, చింత జాఱి రాజసింహుఁ జేరి
కొంత తన్ను దూఱికొని బత్తిఁ దనదారి, వింతసూక్తి మీఱి వినుతిజేసె. 144

నిరోష్ఠ్యదండకము.—

శ్రీరాజితాకార! సాకారసాకేతరాచారసాకేత రాజన్యసన్యస్తనానాక్రియా! ధన్య సంకీర్తనాసక్తనక్తంచరాదైన్యజన్యాచలాగణ్య! ధైర్యాశ్రయావాస! నిశ్రేయసాధార! సాధారణాన్యత్రయీకేళికాశాలినాళీకరాట్సంతతిక్షీరసిరాకరాధీశ రాకానిశాకాంతశాస్త్రైకరాద్ధాంతగాధేయ యాగాంతరాయక్రియా కారణాదిత్యరాజారినిర్ధారణా! చారణశ్రీహృతాంచజ్జటాధారినారీశిలాకార! శ్రీకంఠకాండాసనాహీంద్రనాగాంతకా శాంతకాంతాంతరంగాధరాకన్యకారిణ కల్యాణకల్యాసకల్యాణ! కల్యాణధాత్రీధరస్థైర్య! రక్షశ్ఛటాహస్తిహర్యక్ష! క్షత్రక్షయాక్షయ్యశక్తిస్థిరజ్యాజరేశానసంఘుర్షణాశాలితా త్రాంత సత్కీర్తిసంఘన్నదిగ్దేశకర్ణాంతదృగ్ధీర్ఘతానందితానందనాత్యచ్ఛశీరేజతేజఃకళానిర్జితానంగరత్నాంగదా! రంగదాకాశగంగాతరంగచ్ఛటాసంగజంఘాలనిర్వ్యాజదక్షేదా! నతాసైకసృశ్యద్దశస్యందనాజ్ఞాదృతారణ్య! తారాకళత్రానన శ్రీచకాసత్కళత్రాశ్రితాశ్లేషణానంద! నానాజటీశాగ్రణీజాగ్రదర్చాలసచ్చిత్త! సత్యాశయాయత్తసారంగ! దైతేయశిక్షాకళాదక్ష! సత్త్రాంత! సాక్షాచ్చిదాకాశసంకాశహేతీ! కిరాతీకృతానేకసత్కార! సత్కారకైరాదృతాదిత్యసంజాత! శాతాస్త్రసంధాత! లేఖాధిరాణ్ణందనాకంధిసంత్రాససన్నాహఛిన్నాదితేయారి! యేరీతి నీరీతి నీరేజజాతాదిధీరాగ్రణీజాలికిం జింత సేయంగఁ జిచ్ఛక్తి సంజ్రిల్లెడిన్ జెల్లరే హల్లకాస్త్రారిదారిన్ గ్రసింపన్ హృషీకేశతాసక్తి రక్షింపఁగం జాసనాఖ్యం జగజ్జాతసృష్టిన్ ఘటింపన్ నటింపన్ ద్రిలోకాధినాథాకృతిన్ జెంది నీశక్తి నిత్యస్థితిం గాంచఁగారాని హేలాగతిన్ రాజలీలన్ రజఃకేళి లాలింపఁగా నెంతయాసక్తి యయ్యారె యయ్యాసతీసంగతిన్ రాగలీలాదృతిన్ గన్నచందాన నందంద క్రీడింపడెందానసిక్రీడ ధ్యానించి యజ్ఞాశిరాజన్యతాక్షాత్సచాంచల్యసంగాంతరంగస్థితిన్ జిక్కితర్కించిహీన క్రియం గాంచి కించిజ్జధీలీల నీహేల శ్రీలాకుటీసక్తిగా నిర్జరాధ్యక్షరక్షావనారక్తిగా నెంచి యిష్టార్థసిద్ధిం గనం జాలె నజ్ఞానరింఛోళినీహాళికం జాతజాతాండకాండక్రియాశాలిగాఁ గాంచి నీచిత్కళాకారరేఖాగతిన్ జ్ఞానదృష్టి న్నిరీక్షించి చిత్తేంద్రియాదిక్రియా

సాక్షిచైతన్యరేఖన్ నిరాఘాటతన్ జేసి రాజిల్లె శ్రీజానకీకాంత నీచెంతనత్యంత
కాంతాకృతిన్ నిల్పి కల్పింపఁగాఁ గంటి నేతాదృగంగాఖ్యలీశాతపన్యస్థితిన్ గన్న
నీచేతనే ఖ్యాతి రాజిల్లెడిన్ ఇందరాత్రించరచ్ఛేదనక్రీడఁ గ్రీడింపఁ దంత్రీ!
జగత్కారణక్రీడ లిచ్ఛాగతిం జెంది యూహ్యంతహీనాకృతిన్ గన్నదెజే గలాఁడే
యిలాకన్యకాచిత్తకాసారసంచార! చంచద్దయాదృష్టి దృష్టించి నాజాతిచేష్టాని
కృష్టేహ దృష్టింప కిష్టాదృతిం జేర్చి రక్షింపఁగా నీకె కా కెరికిం జేరికే? హరి
కల్యాణసంధాయకా! దైత్యహృత్సాయకా! జానకీనాయకా! 145

మ. అని వినుతించి రామవసుధాధిపుచెంత వసించి మూర్ఛిలం
గను గనుదోయిబాష్పములె కౌతుకబాష్పము లైనమాతకున్
జనకకుమారికామణికిఁ జాఁగిలి మ్రొక్కి కరద్వయంబు చ
క్క నుదుటఁ జేర్చి యి ట్లనియె గౌరవచారువచోవిజృంభణన్. 146

మత్తేభకంపగర్భితసీసము.—
విగతకామాత్ములు విశ్వమాతవుగదా కల్యాణియం చెన్నఁగాఁ దనర్చి
విహితతత్త్వస్థితి విద్యలై త్రిగుణతా హేలాకృతిం జెంది యీక్రమమున
సతతసౌశీల్యవిశాలతల్ వెలయఁగా దర్శించి ధన్యుల్ సదా ముదమున
నిశితబుద్ధ్యున్నతి నిన్నె కొల్తురుగదా సీతా జగత్కారిణీ! తిరముగ

ఆ. ననుచు వివిధగతుల ననిలతనయుఁడు పొగడిన వినుచు దగుకరుణ ననెను
జనకనృపతితిలకతనయ ఘనతరల, సదమృతరససుఖదవిదితగతిని. 147

మ. సకలసజ్ఞానకళాకలాపుఁ డినవంశస్వామి లోకావనో
త్సుకుఁడై శాశ్వతభక్తియుక్తి శివు నీచోటన్ బ్రతిష్ఠించినన్
సికతామాత్రునిగాఁ దలంపఁదగునే నేఁడాదిగా నిట్టిగా
యకముల్ సేయకుమన్న! స్వామిహితకార్యాసన్నతం యంత్రకా! 148

తే. తప్పు చేసితిఁ బలి కని తల్లడిలకు, నీమనశ్శుద్ధి యెఱుఁగు శ్రీరామవిభుఁడు
పాపఁ డాటల కెనసినపనులు చూడఁ, దండ్రికానందములు గాక తప్పు లగునె?

క. స్వామి నిజమర్మ మంతయు, నీమీఁదియనుగ్రహమున నీ కెఱిఁగించెన్
బ్రేమమున దాఁచ కిప్పుడె, నామర్మము దెలిపెదను సనాతనఫణితిన్. 150

క. రామస్వామిపరాత్పరుఁ, డేనూలప్రకృతిఁ గార్యహేతుత్వములన్
మే మిరువుర మై వెలఁగుదు, మామీఁదటియొకరహస్య మధిపుఁడె యెఱుఁగున్.

శా. తత్సాన్నిధ్యవిశేష మేఁ గని మహత్తత్త్వాదితత్త్వైకసం
పత్సామగ్రి వహించి తద్విషయరూపవ్యాపకం బైనయే

తత్సర్వంబు సృజింతుఁ బెంతు నడఁతున్ త్రైగుణ్యవిస్ఫూర్తిచే
వత్సా! మన్మహిమంబె సుమ్ము మతిదృగ్వ్యాపారదృశ్యాకృతుల్. 152

మ. త్రిపుటీశూన్యన కీజగజ్జననశక్తిస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
గపిలోకేశ్వర! సత్వసంకలితసంకల్పాకృతిన్ మించి భే
దపుభావంబు వహించి యుండియు నభేదవ్యాప్తి వర్తింతు నీ
యపురూపంపురహస్య మీ వెఱిఁగి నిత్యానందముం బొందుమా. 153

తే. తావకీనాంగకీలాలధార జాఱ, వఱలుకుండంబు నీ పేర వన్నె మీఱ
ఘోరదురితాపహారప్రకార మగుచు, నిది మొదలుగాఁ బ్రసిద్ధి వహింపఁగలదు. 154

సీ. పాడగన్న వడ రెన్నఁ డిడకున్నఁ గడచన్న యెడ మన్ననల నిల్పు నీతటాక
మరుడెంచు బిరుడెంచునరుముంచు తెరనొంచి పెరిగించు గురుఁ జేర్చు నీతటాక
మనువారఁ దనుఁ జేర నెన రూరఁ దనివార నినపారరుచి సేయు నీతటాక
మును మానమున మాన కనుతానమున పాన నెనలేని సిరులీను నీతటాక

తే. మిది జగజ్జనజీవనం బిది సుధైక, జీవనం బిది లోకైక పావనంబు
ఇది తపోధనపరితోష మిది విశేష, మీసరంబు సరంబులమీసరంబు. 155

తే. జనులయెమ్ములు నీసరోజలములందు, నెంతకాలంబు వసియించు నంతకాల
మంతకాలయ మొందక చింతమాలి, దివ్యగతి నుందు రమరసదృక్షు లగుచు. 156

తే. హేళిలీల తమగపాళి పాళి మాలి, వ్రాలులీల సదాలోకలోలలోక
జాలభవహాలహాలహారి! శూలపాణి, త్వత్సరోమణి మునుఁగ దుర్దశ లడంగు. 157

సీ. భవజటాజూటసంభవ యైన గౌతమీనదిలోనఁ దాన మొనర్చుసుకృతి
కశ్వమేధసహస్రశాశ్వతఫల మబ్బు నబ్బుర మబ్బింప నంతకంటె
శతగుణాధికపుణ్యసంపద నింపుగంగాపతంగకుమారికాతరంగ
సంగతి గలసరస్వతిలో మునింగిన నానదీస్నానోపమానఫలము

తే. చేరుఁదావకకుండాభిషేకమహిమ, నహిమమహేశ్వరునంతవాఁడైన దీని
నెఱిఁగియిదమిత్థ మని నుతియింపఁగలఁడె, నిజము చెప్పెద విను మింకె నిష్కళంక!

క. హనుమత్కుండంబున నే, జనుఁడేని తిలోదకము లొసఁగు ముదమున నా
తనిపితరులు ఘృతకుల్యం, దనరుదు రని సపతియై జనకసుత పలుకన్. 159

క. సీతారాములపలుకుల, చేతఁ గలఁకదేఱి యచట శివలింగము సం
ప్రీతిమెయి నిలిపె మారుతి, భూతలజను లెల్ల మొదటఁ బూజ లొసంగన్. 160

వ. ఇత్తెఱంగున లోకోత్తరుం డైనమరుత్తనయుండు సీతామత్తకాశిని చిత్తేశచిత్తహార
లింగంబునకు నుత్తరంబున నిజాయత్తలింగంబు నభంగనిష్ఠం బ్రతిష్ఠించినట

న్నతనిలాంగుళవేష్టనంబున రామలింగంబు పవిత్రయకలితాంగంబై యిప్పటికి జగజ్జనదర్శనంబులకు నిదర్శనం బయ్యె నని రామలింగప్రతిష్ఠాపనకథనంబు దురధిగమజనురంబుధిసర్గకథనం బని వసిష్ఠమునిపురుహూతుండు గౌతమసూతి కిట్లనియె.

ఉ. వాయుజుపై ఘరాత్మజకు స్వామికిఁ గల్గిన ప్రేమ తత్కృపా
శ్రీ యిరవొందుటల్ దెలియఁజెప్పినయీకథ విన్న మేటి నీ
ళ్లాయురుపేతుఁడై బహుధనాన్వితుఁడై వెలుఁగొంది యంతటన్
శ్రేయముఁ జెందు నా విని వసిష్ఠతపస్వికి శ్రోత యి ట్లనున్. 162

ఉ. హృత్పరితాప మార్చి కృప సీగతి మారుతిఁ బ్రోచి రామభూ
భృత్పరమేశుఁ డెందు వసియించె? విశేషము లెవ్వి? శ్రీహనూ
మత్పరసత్కథామృతము మాటికిఁ గ్రోలెదఁ దెల్పవే యనన్
దత్పరతం దపోవిధకథానిదుఁ డమ్మునివర్యుఁ డి ట్లనున్. 163

ఉ. రాజకులైకభూషణుఁడు రాముఁడు పుష్పక మెక్కి జానకీ
రాజముఖీసమేతుఁ డయి రమ్యమతిన్ నిజరాజధానికిన్
దేజ మెలర్పఁ బోవుచును దివ్యులపువ్వులసోనతో భర
ద్వాజులయాశ్రమం బెనసి వాయుకుమారునిఁ జూచి యి ట్లనున్. 164

చ. పరహృదయజ్ఞతాగరిమఁ బ్రాభవచోరచనాచమత్క్రియన్
సరసుఁడ వౌట మాభరతుసన్నిధి కేఁగి మదాగమంబు మ
చ్చరితముఁ దెల్పి రమ్మనుచు స్వామి ప్రియంబునఁ బంపె మారుతిం
దిరువడికంటె నాప్తుఁ డవనీపతి కెవ్వఁడు భక్తిశాలులన్. 165

ఉ. పంచిన మంచి పంచఁగని పావని మానవరీతి నాతనిం
గాంచి పదంబులార్చనలు గైకొని రామకథామృతంబు వ
ర్షించె హరించె శోకశిఖిజీవన మిచ్చి తటంచు నెంచి హ
ర్షించె ఘనప్రభావులకుఁ జిత్రమె యుల్లము చల్లసేయుటల్. 166

తే. హనుమ రాక పహిల్లనయాక్షణంబ
పరహసనచంద్రికలు గాయఁ దమము వాయఁ
దటుచుగా హర్షబాష్పామృతంబు గురియఁ
బటుకళానిధి చెలువొందె భరతుఁ డపుడు. 167

మ. ఘనసేనావళి మేనఁ బూనికొని శాకద్వీపమర్దక్షణం
బునఁ బ్రాపించినసత్వరంబు దసరం బోనిచ్చి రామాభిషే

కనిమిత్తం బయి యుత్తరాంబునిధి రంగత్స్వైరపూరంబుకాం
చనకుంభంబునఁ దెచ్చు టేమిటికి నాశ్చర్యంబుగా నెన్నఁగన్. 168

ఉ. మారుతిఁ గూర్చి స్వామి బహుమానము మిక్కిలి చేసి యున్నచో
నారఘురామునానతి మహామణిహారము పూని దీనమం
దార! కుమార! రమ్మనుచుఁ దానె యురంబున వైచి చూచె న
య్యారె! ధరాకుమారి కనిలాత్మజుపైఁ గలహార్ది యెట్టిదో! 169

ఉత్సాహ.—
ధారణీకుమారికాప్రదత్తరత్నహార మ
ప్పారి వక్షమందుఁ బూని యభ్రశుభ్రవాఃకణో
దారతారకానువృతస్ఫురత్సురాచలా
కారుఁ డై చెలంగె నన్న గౌతమాత్మజుం డనున్. 170

ఉ. అప్పుడు రామచంద్రుఁడు శతాననరాక్షసశిక్షఁ బూనుటల్
దెప్పర మైనమారుతికడిందిబలంబునఁ బూనె నంటిరే
యప్పని యెట్లు పూనెఁ బవనాత్మజుఁ డంత సవిస్తరంబుగాఁ
జెప్పఁగదే యనన్ ముని వచించు సమంచితవాక్చమత్క్రియన్. 171

ఉ. ఆహవభూమి రామవినుతాత్మశరోదితశోణితోద్భవో
త్సాహబృహచ్ఛతాననశతంబు హతంబుగ నేల మట్టుచున్
వాహన మై ద్విషజ్జయ మవారణ నిచ్చిన మెచ్చి మచ్చికన్
శ్రీహనుమంతుఁ గన్గొనెడుసీత జగత్త్రయమాతఁ గొల్చెదన్. 172

చ. క్షితిసుత మున్ను రాఘవునిచే హనుమత్కృషి యేకపాదరు
ద్రతయుఁ దదంశ మూని యవతారముఁ జెందుట లాలకించె నం
చతని రఘూద్వహుండు గొనియాడిన చెల్లను దేటగా వచిం
చితిఁ గద యంతమీఁదటివిశేష మశేషము విన్ము తెల్పెదన్. 173

శా. కాకుత్స్థాగ్రణి యట్టు లాత్మకథ వక్కాణింప భూపుత్రి య
త్యాకాంక్షన్ వినఁగాఁ బ్రపత్తిమెయి సాష్టాంగంబు సేవించినన్
మీ కారుణ్యమునం జెలంగుభటునిన్ మీ రింత వర్ణింతురే?
యోకారుణ్యచరిత్ర! శత్రుహృతి కుద్యోగింపరే నావుడున్. 174

సీ. పురరక్ష కనురూపబుద్ధిసంపన్ను మహామాత్యు నియమింప నవధరించి
యుఱవైన ప్రజ నేలుపఱచి తోతెండని సేనాధిపతులకు సెల వొసంగి

కౌసల్యమొదలుగాఁ గలతల్లులకు మ్రొక్కి వారిచ్చుదీవనల్ వరుస నంది
తమయత్తలకు మ్రొక్కి తాను రాఁ బయన మాక్షితిసుతరాక కంగీకరించి

తే. మణిమకుటమూని హైమవర్మంబు దొడిగి
హారకేయూరకరకంకణాదిబిరుద
భూషణాలంకృతాంగుఁడై భూమివిభుఁడు
వేగమున యుద్ధసన్నద్ధవేషుఁ డయ్యె. 175

సీ. తనవామహస్తంబు నక్షీణమృదుపాణి వహియించి సీత పార్శ్వమున నడవ
నాబద్ధతూణీరుఁడై వెన్క సౌమిత్రి శరచాపములఁ బూని యరుగుదేరఁ
దొడి ఫ్రాసి కట్టి యప్పుడు పచ్చుప్రజఁ జూచి భరతశత్రుఘ్నులెడ్చారికసేయ
నుభయభాగంబుల నొడ్డోలగంబుగా సబలు లక్కజవిభీషణులు గొలువ

తే. గజరథతురంగమపదాతికలితమనుజ, దనుజవనచరసైనికోత్కరముతోడ
హనుమ వలపలిమూఁపుపై హస్త మూని, యినకులస్వామి నగరోపవనముఁ జేరి. 176

తే. భరతభానుజపౌలస్త్యపతులఁ జూచి, మనబలము లెల్ల వచ్చెనే యనిన స్వామి
యన్నియును [illegible] నని వారు విన్నవింప, హనుమతఁ డఁ జూడ నతఁడు సాష్టాంగ మెరఁగి.

క. చుక్కలు మొలపూసలుగా, దిక్కుల కవకాశమిడని దివ్యాంగముతో
నెక్కుడఁ జూచినఁ దానై, యక్కపిశేఖరుఁ డజాండ మంతయు నిండెన్. 178

సీ. ఒక్కెంగకుఁ జాల వుల్లోలకల్లోలసంప్లుతాంబరసప్తసాగరంబు
లొక్కచక్కికిఁ జాల వుగ్రభానుహిమాంశుమండలోద్యద్గ్రహమండలంబు
లొక్కపుట్టిన కోర్వ దుర్వరాఖర్వధూర్వహవరాహివరాహరాజముఖ్యు
లొక్కయుద్ధలి కాన దూర్ధ్వలోకానీకగర్భితబ్రహ్మాండకర్పరంబు

తే. శక్రవిద్వేషివిభవంబు నాక్రమింప, విక్రమించు త్రివిక్రమోపక్రమమున
నధికుఁ డమ్మేటి కమలగర్భాండపేటి, నిండి నిజమూర్తి విస్ఫూర్తి నిలిచె నపుడు.

సీ. మయి గపల్వఁడు గాక పయిమూర్ధ్నమై రాలుతుణములో నూర్ధ్వలోకంబులెల్లఁ
జక్క సిక్కఁడుగాక వ్రక్కలై పడిపోవు గడి దక్కి యట మీఁదికర్పరంబు
పదము మెట్టఁడుగాక భగ్గున నడుగంటుఁ బైమోపుతోఁ గచ్ఛపప్రభుండు
బిగువు మాపఁడుగాక పెటిలి బీఁటలువాఱుఁ జక్రవాళముతో దిశావలయము

తే. అఖిలదుస్సహరాక్షసాధ్యక్షశిక్ష, కైనయుతను వావహించుట యింతె కాక
యట్టివిగ్రహమున నాగ్రహమును బూని, నిగ్రహించిన లోకముల్ నిలు గావె?

తే. మారుతి సమస్తలోకోపకారి గనుక, నొక్కదిక్కున ఘనమూర్తి నొందియున్న
నవని యెక్కడఁ గ్రుంగునో యతిభరమున, ననుచుఁ గకుభంతముల నెల్లనావరించె.

మ. తనవిర్ఘాతకఠోరవాలము బృహత్కాయంబు రక్తాననం
బును బద్ధాంజలియున్ రఘూద్వహపదాంభోజాతవిన్యస్తస
ద్వినయాలోకము దుర్నిరీక్ష్యతనుకాంతిస్ఫూర్తి వర్తిల్లఁగా
హనుమద్వానరవీరుఁ జక్కఁ గనలే రవ్వేళ బ్రహ్మాదులున్. 182

సీ. ఆపదుద్ధారకం బనుమనూత్తమముచే సద్భక్తుఁడై విభీషణుఁడు పొగడె
మంత్రిగాఁదలఁచుదుర్మదుఁడనన్ క్షమియింపుమనిహస్తములు మోడ్చెనర్కసుతుఁడు
మాత్రివిక్రమమూర్తి మారటిమూర్తియే యౌనని ఋక్షేశుఁ డభినుతించె
నింతవాఁడై గర్వ మింతయుఁ గనఁ డంచుఁ గాకుత్స్థునతి శిరఃకంప మూనె
తే. ధరణిసుత కన్నుఁగవ మోడ్చె భరతుఁ డెంచె
నలర సౌమిత్రి శత్రుఘ్నుఁ డరుదు నెందెఁ
నొదవవారల నేమి చెప్పుదు కపీంద్రుఁ
జక్కఁ గను విచ్చి చూడ నశక్తులైరి. 183

సీ. ఆవేళ హనుమంతుఁ డాకాశ మంటినతనదీర్ఘదేహంబు ధరకు వంచి
పతి కెక్క నజ్జుగా నతి సేయునటు లున్నఁ దన్మహాకంధరాంతరమునందు
ధరణిజ నెక్కించి తానును మున్నెక్కి మెట్టి రాఁ దలఁకుతోఁ బుట్టువులను
నరసైనికుల వనేచరసైనికుల నిశాచరసైనికులఁ జూచి శంక యేల?
తే. హనుమ నారోహణము సేయుఁ డనిన వారు, నేల యీనినచందాననిండియున్న
తమతమబలంబుతోఁ గూడి తరుచరేంద్రు, వీఁపుపై నెక్కి వినుతి గావించి రపుడు.
సీ. ఎవ్వానిబలుసేన లెత్తిరాఁగలవన్నఁ బల్లటిల్లుదు రిలాభారవహులు
లెక్కసేయఁగరాని దిక్కున నేరాజుమూఁక పేరుగణించు లోకవితతి
యేరాజువాహిను లెదురొడ్డి లవణాబ్ధి బెట్టిదం బడఁగించి కట్టఁ గట్టె
నేరాజుబలకోటి నీక్షించి జేజేలు చుక్క లెన్నికయైన సులభమండ్రు
తే. సాగరము వెల్లివిరిసినచంద మొందు, నేమహారాజువశ మట్టిరాముసేన
యఖిలమును గూడి వీఁపుపై నధివసించె, ననిన సామీరిమహిమ యేమనఁగవచ్చు?
క. హనుమచ్ఛరమాంగాగ్రం, బున సీతాయుక్తు రామభూవరుఁడలరెన్
గనకధరాధరశిఖరం, బున నిలిచిన మెఱుఁగుతోడి మొగులు తెఱఁగునన్. 186
ఉ. సందడి సెంది పందురక సందుల గొందులఁ జిక్కి త్రొక్కుడుల్
సెంపక వెక్కసం బడరి చిందఱవందఱ గాక మూఁక లా
నందము నొందుచున్న రఘునాథునియాజ్ఞ శిరంబునన్ మరు
న్నందనుఁ డావహించి గగనంబున కుద్ధతి నుద్గమించినన్. 187

తే. వనచరేంద్రనిలాంగూలవల్లియనెడు, కాండతతిఁ గూడి లోనఁ జుక్కలబెడంగు
దొరసి మెఱసినయూర్ధ్వకర్పరము వోలెచెఁ, బుడమిఁజేరికి ముత్యాలగొడుగులీల.

శా. ద్యావాభూమిపరిపూర్ణభృత్యచరమాంగాగ్రస్థలాధ్యాసియై
భూవర్యాగ్రణి మింటిత్రోవఁ జనుచున్ బుణ్యాశ్రమోర్వీరుహ
గ్రావారణ్యసరిత్సరోవరనదగ్రామావళుల్ చూపి సీ
తావామాక్షికిఁ జెప్పె నిట్లనుచుఁ దత్తద్వర్ణనోదీర్ణతన్. 191

చ. అరిహరణార్థియై చన నిజాయతవార్లహరీఘుమంఘుమ
స్వరమున గెల్పుగీవన లొసంగుచుఁ దుంపరముత్తియంబులు
తరళతరంగహస్తములఁ జాల్చి యయార్థము సేస వెట్టెడిన్
గరువలిపట్టికిం గగనగంగ గనుంగొను మంగనామణీ! 192

ఉ. గిబ్బవయాళికానిజడ కెంజిగి యంటెనొ వేల్పుసిబ్బెపుం
గుబ్బెత లుబ్బియాడుతఱి గుబ్బల జొబ్బిలుకుంకుమప్రభల్
ప్రబ్బెనొ మంచుగుబ్బలిఁ దొలంగుట జేగురు రేఁగెనో యనన్
గబ్బివహించె నెఱ్ఱనయి గంగ మరుత్సుతుకాంతి పర్వనన్. 193

మ. సరసభ్రాజదనంతపాదకటకున్ సంఛాదితాశాంబరున్
సురసంసేవ్య శిరస్సముజ్జ్వలసురస్రోతస్వినీచంద్రు బం
ధురశుభ్రచ్ఛవిమూర్తిఁ బల్లవధనుర్ధుస్సాధ్యయోగీంద్రు భా
సురసారంగసముత్కరున్ హిమగిరీశుం జూడు మబ్జాననా! 294

లయగ్రాహి.
రంగుగల పచ్చలమెఱుంగుఁ గని పచ్చికబెడంగనుచు వచ్చినకురంగములగుంపుల్
చెంగటనె భగ్గునఁ బతంగమణు లంటినమిడుంగుఱులు గెంటితమయంగములఁబాఱన్
చంగునను దాఁటి యుఱుకం గెలన నవ్వెడిసురాంగనలనవ్వులఁ గరంగు నెలరాలం
గాంగలహరింబలెఁ దొరంగుచఱులం గెలయుబంగరపుగట్టిదె కుఱంగట లతాంగీ!

తే. కొంజరేయాంగరుచివల్లికలు కడాని, గట్టు ముంచినఁ గని తెఱగంటిచెలులు
మింటఁ జనుదెంచె రెండవమేరు వనుచు,నుఱక భయవిస్మయము లొందియున్నవారు.

సీ. డింభీరఖండప్రకాండధావళ్య మాననము వెల్వెలఁ జేసికొనుట గాఁగఁ
దోడ్తోఁ బొడముసిటిటిటుంపరల్ నెఱమేనఁ దవులుస్వేదాంబుబిందువులు గాఁగ
వినువాఁక మొనదాఁక నెనయ నుబ్బుట పత్తిఁగూడియోజింప నేఁగుటలు గాఁగ
సర్వదిక్కూలంకషధ్వాన మిది మానుఁ డని బిట్టు మొఱపెట్టుకొనుట గాఁగఁ

తే. ఎవరి మును దక్షిణాబ్ధి బంధించినట్టుల, వచ్చెనో తన్నుఁ గట్టింప వాయుజుఁ డని
వెఱవు మది గ్రమ్మి ముక్కంపువిరులఁ బూచి, యూఁగుచున్నట్టులున్న దీయుత్తరాబ్ధి.
తే. సహజగుంభితశబ్దముల్ శ్రావ్యములుగ, సహజగాంభీర్యమాధుర్యసహిత మగుచుఁ
గవుల నోరూరఁ జేయుసత్కావ్యరీతి, యిక్షురసవార్ధి చెలువొందె నింతి కనుము.
ఉ. ఊరక మ్రోయుచుం దెసల నుద్ధతిఁ దుంగతరంగహస్తముల్
బారలు చాఁపుచున్ నురుఁగుఁ బైపయిఁ జూపుచుఁ దుంపరల్ పడం
బాఱుచు బొంగుచున్ బయలు ప్రాఁకుచు గట్టులు దాఁకుచున్ సురా
సేరధి మించెఁ జూడు తరుణీ! జడభావము మాన దెయ్యెడన్. 299
మ. జలకాంతాకబరీభరోజ్జ్వలమిళచ్ఛైవాలనీలప్రభా
వలయోత్తుంగతరంగసంఘవిచలద్వైమానికానీకమై
జలభద్రేభవిహారముద్రితసమంచచ్చంద్రికావర్తమై
చెలువొందెన్ ఘృతవారిరాశి యెదుటన్ సీతాసితాబ్జేక్షణా. 200
శా. ఆకర్ణాంతవిశాలలోచనశతాస్యాదిత్యవిద్విడ్భుజా
వ్యాకృష్టామితపాలనాన్వితము మాయాపట్టణం బున్నత
ప్రాకారోపరిశృంగలగ్నరవిచక్రక్షేమసాక్షాత్కృతే
చ్ఛాకల్పారుణదోఃప్రయాస మదిగో శాకాంతరీపంబునన్. 201
ఉ. దానవలోకనాథునిప్రతాపశిఖల్ వడిఁ గ్రమ్మి నిల్చిన
ట్లైనగరంబుచుట్టుఁ బసిఁడిహేమపుఁగోట త్రినేత్రుఁ డైనఁ బో
మానిని చక్కఁ జూడ నసమర్థుఁ డనన్ బెఱవారు శక్తులే?
ఏనిఁ దృణీకరించి కపివీరుఁడు మారుతి వచ్చెఁగా కిటన్. 202
మ. అతిలోకం బగుదైత్యవానరనరేంద్రానీకముల్ వీఁపుపై
భృతిగావించి నభోగతిం ద్రిజగదాభీలప్రయాణోద్ధతిన్
జతురంభోధులు దాఁటి శత్రుపురిఁ జేర్చ న్నేర్చు నెవ్వాఁడు? మా
రుతపుత్త్రుం డవలీల నింతపని కారోహించెగా కియ్యెడన్. 203
ఉ. నాలుగువారిరాసులు క్షణంబున దీవులతోఁ దరింపఁగాఁ
జాలినయప్రమేయజవశాలికి మున్ లవణాబ్ధి దాఁటుటల్
చాలఁ బ్రయత్నమే? భువనజాలము లన్నియు నొక్కజంగను
జాలునె? కామరూపత బొసంగిననిక్కపిచక్రవర్తికిన్. 204
మ. మన లంకాపురిమీఁదఁ బోవుతఱిఁ నిమ్మూర్తిన్ విజృంభించి ని
ల్చినఁ దద్రావణకుంభకర్ణు లెదురే చింతింప మత్కీర్తిభూ

జను లెంచక లవణాబ్ధిబంధనముఖ్యోత్సాహైకసాహాయ్యుఁడై
తనరన్ నా కతఁ డాప్తుఁడై తగ నసాధ్యం బెద్ది లోకంబులన్. 205

క. ఈకడ వింతలు మనము వి, లోకింప న్వైకగతిని లోభము వోరనెం
గాక మనోజవగమనముఁ, గైకొన సిద్ధివి నిమిషగతి కున్నదియే?! 206

ఉ. బాలమరుచ్చలత్కిసలపాణి చలింపఁ బికాళిరాజకీ
రాళిమృదూక్తిఁ బావని నిజాపనిఁ బాపము లూఁచఁ బిల్వఁ బ
త్త్రాళివనాంతలక్ష్మిఁ దిలకించితె? చంచలనేత్ర! యచ్చటం
బాళిము డించి రక్కసులఁ బంపుచు మర్కజునీను చూడఁగన్. 207

మ. అని రామక్షితిపాలమౌళి సుమనోహారిత్వరంభాదిసం
జనమై సంశ్రితదేవవల్లభరమాసంభావితం బైనసం
దనముం బోనిద్విషత్ప్రరోపవనమున్ వర్ణించి వాతాత్మజుం
గని సేనాపతి నీవ డించు మని పల్కన్ భూమికిం డిగ్గుచోన్. 208

ఉ. అబ్బురమయ్యె నద్దిర యజాండము నిండినపండిమేనితో
గొబ్బున వచ్చుచున్న దొకకోఁతి యటం చురుదండపాణులై
ప్రబ్బినకిన్కఁ బూనువనపాలురు మ్రగ్గఁడిగ్గ నేలకున్
డెబ్బదిరెండువెల్వలను డిగ్గెను డిగ్గిరి సైనికాగ్రణుల్. 209

క. ఆరామనృపతి పతితో, నారామ మలంకరించి యర్కజముఖులం
జీరి సురారిమహాపురి,పై రణమున కరుగుఁ డనుచుఁ బనిచె ననుటయున్. 210

క. విని గౌతమసుతుఁ డిటువలెఁ, బనిచినపతియాజ్ఞ పూని భానుజముఖ్యుల్
చని సురవైరులతో నని, మొనసినపని దెలుపుఁ డనుచు ముని నడుగుటయున్.

ఆశ్వాసాంతము.

చ. అసురహరా! హరార్చితమహితాత్మ! హితాత్మవిచార! చారణా
ప్రసరదయా! దయారసనిరంజన! రంజనభావ! భావనా
భ్యసనపరా! పరాశరముఖాదర! ఖాదరధీర! ధీరతా
హసితధరా! ధరావనసమాహిత! మాహితబోధ! బోధకా! 212

క. శరణాగతభరణాభ్యా, శరణాహతదూషణాదిశాత్రవ! కరుణా
శరణా! పరిహృతశరధీ!, శరణాకరణాదిదూరసంవిద్ధరణా!. 213

స్రగ్విణి.—

అబ్జపత్త్రేక్షణా! యార్తసంరక్షణా! యబ్జరేఖాననా! యాశ్రయత్కాననా!
యబ్జకీర్త్యాదరా! యార్యవర్యాదరా! యబ్జసింధూర్జితా! యచ్ఛచిద్ధ్యాస్పదా!,

గద్య. ఇది శ్రీమదంజనాతనయదయారసలసత్కటాక్షవీక్షామహత్త్వసంప్రాప్తకవిత్వవిద్యావధాన సగుణనిర్గుణధ్యానవాసనానిధానసమాన సబిసపుష్పపుష్పగిర్యప్పనార్యకుమార సమాశ్రితబుధాచారగురుజనవిధేయతిమ్మననామధేయ ప్రణీతం బైనసమీరకుమారవిజయం బనుమహాప్రబంధంబునందు మైరావణవధయును సత్యలోకగతుండైన గంధమాదను మరలఁ దెచ్చుటయు లింగప్రతిష్ఠాపనకథయును తత్త్వోపదేశంబు సేయుటయు హనుమత్తీర్థమాహాత్మ్యవర్ణనంబును హనుమద్విశ్వరూపంబును మాహాపురప్రయాణంబును తత్పురోపవనప్రవేశంబునున్నది చతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# పంచమాశ్వాసము.



క్షోణీపుత్రీయశస్యా
భీషణలీలామిళిందబృందపసరోజా
పేశలసఖిలక్షణముఖ!
దాక్షాయణ్యుక్తనామ! దశరథరామా!. 1

తే. అవధరింపుము భూతదయాగరిష్ఠ, జగువసిష్ఠుఁ డనియె గౌతమాత్మజునకు
విను శతానంద! శ్రీరామవిభునియాజ్ఞఁ గపులొనర్చినరణము సాంగంబు గాఁగ. 2

ఉ. మర్కటసైనికేంద్రుల సమగ్రబలాఢ్యులఁ జేరుపేరుసం
జేర్కొని యర్కజాంగదవిభీషణముఖ్యుల నవ్యసైన్యసం
పర్కముగా శతాస్యపురిపైఁ బురికొల్పి పరాగపాళిచే
నర్కునిఁ గప్పుచుం గిలకిలార్భటి దిక్కులు వ్రక్కలించుచున్. 3

చ. తరుధరణీధరాశ్మములు దాల్చి సముద్ధతి భూమికోట ద
గ్గఱి నలువంకలం గలయగడ్తలు పూడిచి కోటఁ గూల్చి గో
పురములు నేల వ్రాల్చి తలుపుల్ బడ దుల్చి యడల్చి వారు ల
చ్చెరుపడఁ జెచ్చెరేఁగి కపిసేన విభీషణసేన హెచ్చినన్. 4

ఉ. ఎక్కడిక్రోఁతిగుంపు లివి యెక్కడిరక్కసిమూఁక లిప్పురం
బక్కట! లోకభీకరదశాననపాలిత మౌ టెఱుంగవో
చిక్కి నిఁ కెందుఁ బోవు నని సింహనినాదము మేదురంబుగా
నొక్కటఁ గాలకేయు లన నొప్పెడుతత్పురరక్షణక్షముల్. 5

సీ. ఖరకరతారత్సరుక్షురికాశుగసృగాదిబహుసాధనోదగ్రపాణు లగుచు
హయతరక్షుమదేభహర్యక్షముఖసమిత్ప్రౌఢైకవాహనారూఢు లగుచు

స్వచ్ఛవజ్రచ్ఛటోచ్ఛ్రయకంకటచ్ఛవిప్రచ్ఛాదితవ్యోమభాగు లగుచు
భీమాట్టహాససంభేదితాశాకుంజరస్వాంతకర్ణాంతరాళు లగుచుఁ
తే. గనుఁగొనలఁ బ్రస్ఫురత్స్ఫులింగములు చెదరఁ
జండగుణఘోషణముల బ్రహ్మాండ మగల
గర్జితాపత్త్రకోద్వృత్తిఁ గాలకేయు
లపరి కపిదైత్యవరులపై నడచి రపుడు. 6

క. కాలవ్యాళకరాళ, క్ష్వేళజ్వాలోగ్రశర న్నిశితకరవాలా
భీలప్రభ లొరసిన రవి, యాలో నద్దంపుబిల్ల యనఁ గనిపించెన్. 7

చ. పొడుపొడు పట్టుపట్టు మని పోయెదు: బోయెదుఁ బోవనీక ను
న్నొడువుల దెట్టివం బొసవ నూఱులసంఖ్యలు గుంపులై పడిన్
బుడమి చరింప నిర్జరరిపుల్ కపిసేనలఁ దాఁకి లగ్గలై
కుప్పడు గనకుండ బల్లెములఁ గ్రమ్ముచు రెమ్ముచుఁ బొఱఁజిమ్ముచున్. 8

లయగ్రాహి—
తిట్టుదురు పాపములనట్టుదురుశూలములఁ గట్టుదురుమీఁదికెగఁ గొట్టుదురు బాణన్
నెట్టుదురు పాశముల గట్టుదురు పెన్గదలఁ గొట్టుదురు నేలఁ బడఁబెట్టుదురుమీఁదన్
జెట్టులును గట్టులును జట్టులును హస్తములఁ బట్టి వెస వైచి కపులిట్టు లటు పోరన్
జుట్టుకొని యట్టెబలు దిట్టతన ముట్టిపడ నట్టియెడ బిట్టసురి కట్టడి యొనర్పన్. 9

శా. బద్ధస్పర్ధఁ గడంగు దైత్యులమహాబాహాబలాటోపసం
పద్ధాటీపటిమం దిటంబు వహియింపం జాల కుద్భ్రాంతులై
యుద్ధక్షోణిఁ జలించువానరుల నోహో నిల్వుఁడీ యంచు స
న్నద్ధుండై నవిభీషణుండు కపిసేనన్ నిల్పి సక్రోధుఁడై. 10

మ. అలఘుగ్రావమహోగ్రకాయుల సుకౌశాజేయులం గాలకే
యుల వీక్షించి స్వసైనికోత్తముల కత్యుద్వృత్తి జేపిచినన్
గలహారంభవిజృంభణోద్ధతి బొసంగన్ వానరుల్ వారితో
దళముల్ గూడిరి తారసిల్లి రట శస్త్రాశస్త్రి నద్దైత్యులన్. 11

శా. ఉల్లోలధ్వజవిస్ఫుటత్పటపటాత్యుగ్రార్భటుల్ దైవహృ
ద్భల్లోద్యత్పటహచ్ఛటాధణథణంధాణంధణల్ శత్రుహా
హాల్లోలస్వనముల్ విభీషణబలాధ్యక్షుపాట్యగ్రణీ
కిల్లిల్లిధ్వను లెల్లెడం జెలఁగె నేకీభావమై యయ్యెడన్. 12

శా. సాహంకారనిరంకుశాహవముఖాహంపూర్వికాలాప మై
బాహాబాహికఁ జూపెదంచు నల మెలర్పం గాలకేయాసుర
వ్యూహంబుం బొదివెం గపిప్రకరము బాహాస్ఫూర్తిమైఁ బోర హా
రాహారిన్ నిజఘోషనిర్దళితపద్మాక్షోపధూగర్భ మై. 13

చ. అగచరు లెత్తివైచు విపులాచలశృంగములన్ గణింపకన్
దగిలి మిణుంగురుల్ పొగలు దొర్కొనఁ గ్రక్కసిమిక్కుటంపుటు
క్కుగనలు మింటితో నొరసికొన్న మహోల్కశంకఁ బాఱువె
ల్లగము నెల్లఁ జింద్రుఁ బకలంకవిమాన మలంకరించుచున్. 14

క. కరనఖరచరణవాల, స్ఫురణలఁ గపు లసురవరులఁ బొదివిరి వారున్
శరపరశుకుంతతోమర, కరవాలోద్ధతులఁ గపుల గదిమిరి పోరన్. 15

క. పూనినతరుగిరు లలుఁగుల, చేనొగి చూర్ణములు సేయ సింహధ్వనితో
వానరవీరులు దనుజుల, పై నుఱుకరె కాని చేటుపా టెంచ రటన్. 16

క. చూచి సము నడవి ద్రిప్పరి, రాచటికము వైచు తాలు రక్కసిగుంపుల్
డాచేత దట్టివైచిన, ఖేచరులకు మిగులఁ బాడవుకే చనవలసెన్. 17

తే. ఉదుటుఁదనమున హరి యొక్కఁ డెదుటివాని
మదమదావళ మరుదేర నెదిరికొండ
మూఁది పట్టి చివుక్కన మీఁది కెగసి
కుంభముల వ్రచ్చె నఖముఖోజ్జృంభణమున. 18

సీ. క్రూరాంఘ్రిహతుల దేవారిశతాంగముల్ వారిశతాంగముల్ వ్రక్కలించి
యలపుమైఁ బూర్వదేవాజిసంచారంబు వాజిసంచారంబువై పడంచి
వడి మీఱి దానవవారణస్ఫురణంబు వారణస్ఫురణంబుతీరు మాన్చి
బలుకినుక శత్రుసంపత్తిప్రాబల్యంబు పత్తిప్రాబల్యంబు పరిహరించి
తే. పోరువానరవీరుల భూరిశక్తి
దాఁటి నిల లేక ముందరిబారు విఱుగఁ
గాలకేయాదిదనుజు లాగ్రహము మిగులఁ
గపులపై సేనఁ బురికొల్పి కడఁగుటయును. 19

ఉ. శంక యొకింత లేక కపిసైనికు లుద్ధురసింహనాద మ
భ్రంకష మై చెలంగ జలరాశిపదాహతిజాతధూళి చే
నింక భుజాభుజిం దొడరి రే మని చెప్పుదు నట్టిపోరునన్
బింక మెలర్ప మార్కొనె విభీషణుసేనలు కాలకేయులన్. 20

